# ఉత్తర గోగ్రహణము

( శ్రీమదాంధ్ర మహాభారతము )

## उत्तर गोग्रहणम्



ప్రకాశకులు:

దక్షిణ భారత హిందీ ప్రచారసభ - ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాదు - 4.

# ఉత్తర గోగ్రహణము

## ( శ్రీ మదాంధ్ర మహాభారతము )

## उत्तर गोग्रहणम्


సంగ్రహకర్తలు :

శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

శ్రీ దుర్గానంద్



ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ : ఆంధ్ర

ఖైరతాబాదు, హైదరాబాదు - 4.

# మనవి

ఇతః పూర్వము దక్షిణ భారత హిందీ ప్రచారసభ వారి రాష్ట్రభాషా ప్రవీణ తరగతుల పరీక్షా ప్రణాళిక ననుస రించి ప్రాంతీయ సభ తరపున శ్రీకృష్ణరాయబారము సంగ్ర హించి ప్రచురించుట జరిగినది. ఇప్పుడు తిరిగి మహాభారతము నందలి విరాటపర్వములోని ఉత్తర గోగ్రహణమును సంగ్ర హముగా గ్రహించి పాఠ్యపుస్తకముగ విద్యార్థి లోకమున కందించు చున్నాము.

మహాకవి తిక్కన రచనలోని రసస్ఫూర్తిని, కథా సంవిధానమును, పాత్రచిత్రణానైపుణిని, ఒక్కచోట రాశిగా చూడవలెనన్న విరాటపర్వమునే చదువవలెను. తిక్కన స్వయముగా విరాటపర్వమును గురించి యిట్లు చెప్పుకొనినాడు "హృదయాహ్లాది, చతుర్థమూర్జిత కథోపేతంబు, నానా రసా భ్యుదయోల్లాసి, విరాటపర్వము" కాబట్టి తిక్కన కావ్య స్వరూపమును పూర్తిగా నవగతము చేసికొనుటకే కావ్య సంగ్రహమెంతయో ఉపయోగపడగలదనుటలో సందేహము లేదు. ఈసంగ్రహమునకు యిందలి పీఠికయొక ప్రత్యేక గణ్య తను సంపాదించి పెట్టినది. అనూచానముగా వచ్చుచున్న తిక్కన కావ్యాధ్యయన సంప్రదాయము ననుసరించి, అంత కంటె మరియొక యడుగు ముందుకునైచి శ్రీ దుర్గానంద్ గారు తిక్కన సహజప్రవృత్తిని, విశేషించి భాషాప్రవృత్తిని

నొక్కి వక్కాణించుటలో ఒక క్రొత్త దృష్టికోణమును, ఒక క్రొత్త విమర్శనాపద్ధతిని సాహిత్య లోకమునకు అందించినారు. సహృదయులైన సాహిత్యకులు తప్పక ఆనందించగలరు.

ఈ సంగ్రహమునకు చివర టీకా తాత్పర్యములతో పాటు అలంకృతపదములు, కొన్ని విశిష్టప్రయోగములు చేర్చ బడినవి. దీనివలన ప్రాచీన సాహిత్యములోని వాక్యవిన్యాస మును అర్థము చేసుకొను నవకాశ మేర్పడుచున్నది. కేవలము టీకా తాత్పర్యములనే యిచ్చి వాక్య నిర్మాణ విషయమున ఆసక్తి చూపని ఇదితర సంగ్రహములకంటె యిదిచాల యుప యోగకరమని మా అభిప్రాయము. భావ, శబ్దార్థములకంటె నెక్కువ వాక్య నిర్మాణముమీద నాధారపడి యుండునను సిద్ధాంతమును ప్రాతిపదికగా గ్రహించి జాతీయములు, సామె తలు, అలంకృత పదములు, విశిష్టప్రయోగములు మొదలైన వాటి చేర్పుకూర్పులతో సుగ్రాహ్యము చేయబడిన యీసంగ్ర హము ప్రాచీన సాహిత్యము నధ్యయనము చేయు విద్యార్థు లకు, ఉపాధ్యాయులకు ఒక వినూత నోత్సాహమును, ఆస క్తిని కలిగించగలదని మేము గాఢముగా విశ్వసించుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ; ఆంధ్ర

హైదరాబాదు

# కథా సంవిధానము

---

ఉత్తర గోగ్రహణము యథాస్థితమైన కథగాదు. ఆఘాతజనితమైనది. అనగా ఒక బాహ్యవిస్ఫోటము రహస్య గర్భితమైయున్న ఒక సంక్లిష్ట జీవనస్థితిని కొట్టగా అది వ్రయ్యలయి చిదిసి చలించి కథగా సాగిపోయిన కథ. ఈ విస్ఫోటము దుర్యోధన ప్రభృతులు ఉత్తరదిశగా గోవులను పట్టుకొనుట. రహస్య గర్భితమైన జీవితము పాండవుల అజ్ఞాతవాస జీవితము. ప్రతిఘాత స్వరూపముగా మత్స్యనగరమునుండి ఉత్తరునితో కథ ప్రారంభమైనది. ఈ కథలో మూడు ప్రయోజనములు గర్భితములైయున్నవి. గోవులను విడిపించుట ముఖ్యప్రయోజనము. యాదృచ్ఛికముగా నొనగూడి కథకు అత్యావశ్యకమైన ఘట్టముగా నిలిచినది, అర్జునుని అజ్ఞాతవాసానంతరము బయలుపడుట. మూడవది ఉత్తరావివాహము. ఇది గోవులను విడిపించుట యను అధికృత ప్రయోజనమునకు ఫలరూపమైన స్నిగ్ధప్రయోజనము. గోగ్రహణము స్థూలకథా నిర్వాహకము. కాని దానికంటె ఉత్తమమైనట్టిన ఏతత్సందర్భమున ఆకస్మికముగా నొనగూడిన బృహన్నలా రూప పరివర్తనము. ఇది కథలోని అంతశ్చేతనకు ప్రాణమువంటిది. ఉత్తరుడు యుద్ధమునకు సిద్ధపడుట, బృహన్నల రథచోదకుడగుట, వారిరువురును కురుసైన్యముతో తారసిల్లుట, యుద్ధముచేసి విజయోత్సాహముతో తిరిగివచ్చుట అనునవి స్థూలకథా భాగములు. వీటి సంపుటీకరణములో బాహ్యకథా శరీరము వ్యవస్థితమైయున్నది. కాని కథా కథన శిల్పదక్షుడైన కవికి, కేవల బాహ్యశరీరాయోజనమే చాలదు. ప్రాణవంతములైన అంతస్సత్త్వములతో కథానాళములను బిగించి శరీరాత్మ సంయోగములతో కథను రూపొందించుకొనవలెను. దీనికి మూలభూతమైన సంఘటనయే బృహన్నలా స్వస్వరూప ప్రదర్శనము. బృహన్నల అర్జునుడని తెలియుటలో ఎన్నియో రాగతంతువులు కథావయవముల నల్లుకొనిపోయినవి. చిత్తవృత్తుల సంచలనగతులలో పెనగొని బాహ్యఘటనలలో అనుస్యూతమైన కథాసూత్రిగట్టును. కేవలము తనను కథగా చెప్పికొనిపోవు పద్ధతి తిక్కనది కాదు. ఆయన బాహ్యఘటనలను నిమిత్తమాత్రముగా గ్రహించి తదనుగుణముగా

తటస్థపడిన చిత్తవృత్తులను యథోచితముగా గుది గ్రుచ్చుకొనును. అతి విస్మయ కారకమైన బృహన్నలారూప పరివర్తనము ముందుకథమీదనూ తరువాతికథమీదనుకూడ ప్రభావము వైచినది. బృహన్నలారూపప్రదర్శనమునకు ముందున్న రూపగోపనమూ, దానికిసంబంధించిన చమత్కారము కవికి కావలసినదేగాని పాఠకునకు కావలసినదికాదు. అనగా అజ్ఞాతరూపుడైన అర్జునుని వ్యక్తిత్వము కవియొక్క రచనా శక్తికి పూర్వవ్యంజనముగా ఉపయోగపడినది. రూపప్రదర్శనానంతరము కలిగిన మార్పు సుస్పష్టము. యుద్ధమూ, దాని తరువాత జరిగిన ఘటనలన్నియూ వాటియంతట అవియే కథను నిర్మించుకొనినవి ఇట్లు ఈ ఘటనయొక్క ప్రభావము ముందు కథ మీద పరోక్షముగనూ, అనంతర కథ మీద ప్రత్యక్షముగనూ పడినది. ఈ ప్రభావగతములైన ముందు భాగములోని ఘటనలు విశేషించి చెప్పవలెనన్న ఇవి. ఉత్తరుడు డంబములు పలుకుట, బృహన్నలను సారథిగా చేసికొనుమని సైరంధ్రి చెప్పగా, ఉత్తరుడు విస్మయ పడుట. ఉత్తరుడు రథము దూకిపోవునప్పుడు ఆగుమాగుమని బృహన్నల రథము దిగి యాతనిని పట్టుకొనుట ఇవియన్నియు బృహన్నల రూపగుప్తి నుండియే వెలికి దీయదగిన రసవత్సన్నివేశములు. తిక్కన వ్యక్తిత్వ సంచాలితమైన ఈ కథా శిల్పము అజ్ఞాతవాస సౌందర్యమట్లు "గూఢ రూపరేఖాస్థితలేమి" పునఃప్రసారౌత్సుక్యమును గలిగించినది. యుద్ధభాగము ఈ రహస్యభాండమునకు ఉద్ఘాటనము వంటిది. తిరిగి కథ ప్రారంభమై ఉత్తరా వివాహముతో అనుసంధింపబడినది. ఇది కథలో అవరోహణ సుఖము. ఉత్తరుని యుద్ధ ప్రస్థానము నుండి దుర్యోధనునితో డీకొనుట వఱకు ఆరోహణము. దుర్యోధనుని ఓటమి కథకు పరిసమాప్తి కావలసినదే కాని ఉత్తరా వివాహ ప్రయోజనమును పురస్కరించుకొని ,అది శిఖరాయమాణమైనది. శిఖరమునెక్కుటలో సంకల్ప వికల్పములతో కూడిన బల ప్రదర్శనముండును.. అంతదనుక వచ్చిన తిక్కన శిల్పము కూడ ఇట్టిదే, శక్తిస్ఫోరకమైనది. అవరోహణలో అలతి శక్తియే చాలును. ఆనందము కూడనుండును. తిరునాళ్ల నుండి వచ్చు పిల్లల అలసటతోఁగూడిన అగ్గిబిగ్గి యాటల వంటిది అవరోహణము. ఇట్టి హేలామాత్రికములైన రచనా వైద్యుతచ్ఛటలు అవరోహణ కథలో తిక్కన చూపినాడు. విరటుని ముందు తన్ను ప్రచ్ఛన్నముగానే యుంచుమని అర్జునుడుత్తరుని కోరుట,

విజయలాభ విపర్యాసమునకు విరటుడు సంభ్రమాశ్చర్య చకితుడగుట, యుధిష్ఠిరుడు ముంగముగంటి చూపించకుండ మోముదాచుకొనుట, పాండవులు రాజవేషోపలాలితులై ధర్మజుని సింహాసనము పైకెక్కించుట, యథార్థము దెలిసిన విరటుని నిస్తులానంద కలకలములూ, ఇవి యన్నియూ దాగుడుమూతల వంటివి. తరళాతి తరళమ్ములైన సుఖద భావతరంగములను కొంచెమేటవాలుగా నున్న సమతలము మీద పిచ్చలింప జేసినట్లున్నవి. కథాగతి త్రిపథగాత్వము వహించి మువ్వంపులు దిరిగి త్రొక్కటబడి సుడులోడి శీకరాంబు పుంఖములతోఁ బింపిల్లవోయినది. కథా పూర్వార్ధము విద్యుద్ఘాత జలపాత వేగధుర్యమైనది, ఉత్తరార్ధము కేదారాధార ధారోదారమైనది.

ఈ కథను నడుపుటలో తిక్కన మూడు ప్రవృత్తుల నవలంబించినాడు. ఒకటి కథకప్రవృత్తి, రెండు కవిప్రవృత్తి, మూడు నాటక ప్రవృత్తి. నిజమునకు తిక్కన కథకుడు కాదు. కవి. కాని చేపట్టినది పురాణము. అందునా అనువాదము. కావున కథకత్వము అనివార్యము. ఈ కారణమున తిక్కనలో కథకుడు, కవి, నాటకకర్త మువ్వురునూ పోటీపడుచుందురు. మొట్టమొదట ఉత్తరుఁడు సారథిలేమికి దిగులొందినాడు. సారథిని సంపాదించుటకై ఉత్తరా సైరంధ్రులు సాయపడినారు. ఇట్టి బృహన్నలా సారథ్యముసిద్ధించుటలో నాలుగు మనస్తత్త్వములు వెల్లుబికి వచ్చినవి. ఒకదానికొకటి భిన్నములైన ఈ పాత్రల మధ్యనుండి కథను తీసుకొని వెళ్లుటకు ఎంతయో చెప్పవలసియుండును. వ్యక్తుల భావప్రదర్శనానురక్తి కలిగిన కవికి ఇది మరింత దీర్ఘమగును. తిక్కన గాక మరియొక్కరైన ఈ ఘట్టమును ప్రబంధమంత పెద్దది చేసి యుండెడివారే కాని తిక్కన కావ్య నాటక ధర్మముల బోషించుచూనే దీనిని ఏబది పద్యములలో ముగించినాడు. ఇది అతి క్లిష్టమైన ముగింపు. ఉత్తరుని ప్రగల్భముల నుండి విచారింతము. ఉత్తరుని చేత ప్రగల్భములు నూటిగాఁ జెప్పించి కథను క్లిష్టీకరించవచ్చును. కాని తిక్కన అట్లు చేయడు. "పసులఁ గ్రమ్మర దేరక యున్న నన్ను" అని హేతుపర్యవసానభూతములైన విశేషములవఱకుఁ బోవును. "అకట! సైరంధ్రి నన్ను నిర్గాలి గొనఁగనేల" అని ఉత్తరునితో మేలమాడించును. "అడుగులననుగాంతి" అని ఉత్తరా కుమారి విలాస విభ్రమములను చవి చూపించును. "ఖాండవ మొనర్చునప్పుడు" అని కొంత దూరకాల సంస్మ

ణములోనికి క్షిప్తము. ఇట్లు పాత్రగత విశేషముల చూపియూ అంత
రాంతర మనోభావ విశదచిత్రణము నెరపియూ కూడ ఈ సన్నివేశమును
ఏబది పద్యములలో ముగించుట తిక్కనకే సాధ్యము. కథను కుదించుటకు
తిక్కన ఎన్నియో పద్ధతులు చేపట్టినాడు. లఘుగద్యల నుపయోగించి
నాడు. హఠాద్భ్రంశములు (Sudden breaks) వైచి బహుముఖ వ్యాప్త
తమైన విషయమును ఒక్కుమ్మడి త్రిప్పి తనవైపునకు లాగుకొనినాడు.
'నేడక్కడో పూసికట్టి' అని కుశలప్రశ్నలు చేసినాడు. రవంతదౌర్బల్యాల
కేగి మరుక్షణములో అతి సమీపమున కొరసికొనుట వంటి వింత వైఖరులు
తిక్కన కథా శిల్పము నింతక ఎగుడు దిగుడుగా చేసెననుటలో సంది
యము లేదు. కాని ఇవన్నియు అతని పట్ల గుణములేకాని దోషములు
కావు నిర్జీవ కథా భాగముల నొత్తికొనుచు బోవుటకంటె మానవ జీవన
గతుల వివరించుటలోనే విశేషమున్నది గదా! కథ నిమిత్తమాత్రమై
యుండవలయునే గాని అది మానవ జీవన నిమ్నోన్నతులనే క్రమింగి
వేయ కూడదు.

ఇంక నీయన మనోభావ ప్రదర్శనమును నాటక లక్షణముతో జమ
కట్టిన అట్టి ఘట్టములెన్నియో భారత రచనలో మనకు లభించునని చెప్ప
వచ్చును. ఈయన పాత్రల వికాసమూ, కథావివృతి కూడ నాటక పద్ధతి
మీదనే యాధారపడి యున్నది. మొదట ఉత్తరుడు బృహన్నలతో
యుద్ధసన్నద్ధు డగుట వరకు నడచిన ఘట్టములో ఉత్తరా ద్రౌపదీ బృహ
న్నలా రూపముల ప్రదీప్తి యంతయు సంభాషణముల మీదనే ఆధార
పడియున్నది. పరస్పర మనోభావములోక యంగీకారము కొఱకు పరస్ప
రము ఒరసికొను పోవుచుండుటవలన నీకథయంతయు సంఘర్ష ప్రాయ
మైనది. ఉత్తరుడూ బృహన్నలయూ విజయ లాభముతో నింటికి తిరిగివచ్చిన
తరువాత కథ కూడ సంభాషణములతోడనే నడిచినది. అర్జునుడు, ఉత్తరుడు
విరటుడు, ధర్మజుడు మొదలైన వారి ఈ సంభాషణములు పైవలె
సంఘర్ష ప్రాయములు గాక కథకు దగినట్లుగనే సమాధాన ప్రాయము
లైనవి. ఇక్కడ కావలసినది భావోన్మేషము గాదు. ఆనందించుట, ఒకరి
నొకరు ప్రశంసించుకొనుట, ఆత్మప్రభావాభివ్యక్తి, క్షమార్పణ మొదలైన
కొన్ని మానవ ప్రవృత్తులూ, స్థాయీభావములు. ఈ గుణములు ఆ కథా
గమనమునకు తగియున్నవి. యుద్ధ సమయమునందు కూడ ఈ సంభాషణ

పద్ధతియే సాహాయ్యపడినది. ఇచ్చటి సంభాషణములన్నియు ఉపాలంభములు. ఈ ఉపాలంభములు మాత్సర్యము, ద్వేషము మాపోపమి మొదలగు సామాన్యగుణములమీదఆధారపడియుండినట్లుగనేచూపుటవలనవిశేషవ్యక్తిత్వములకివిరంగులనద్దలేదు. దుర్యోధనుడు,భీష్ముడు,ద్రోణుడు, కర్ణుడు మొదలగువారిఅవజ్ఞాప్రదర్శక సంభాషణములన్నియు వ్యక్తుల వ్యక్తిత్వప్రాభవమునుగౌణపఱచి యుద్ధవీరమున కుద్దీపకాంగములుగనేమిగిలిపోయినవి. ఏమైననుతిక్కన నాటకపద్ధతి ఇక్కడగూడనూ తన నెరనీటుల మాపించినది. ఇక కవిగా తిక్కన కావ్యసంతతును క్రిక్కిఱిసి యున్నాడు. ఇరుసేనల యుద్ధ సంరంభములూ, యుద్ధసంరంభములోని సహజ చిత్రణలు, ఉత్తరలాంటి సుందరాంగనల వర్ణించు సొగసైన ఘట్టములు, అభినవ జలధర శ్యామంబులలోని ఉత్ప్రేక్షలు మొదలగున వన్నియు తిక్కన కావ్య ప్రతిభకు నిదర్శనములు. ఒక్క మాటలో చెప్పవలెనన్న తిక్కన నాటకకర్తవలె పాత్రల సూక్ష్మమనః పరిశీలనము గావించినాడు. వాటిని కవివలె హృదయాహ్లాదకరముగా అభివ్యక్తీకరించినాడు. వీటి నన్నిటినీ కలిపి ఉత్తమ కథకునివలె నెలకువతో సంపుటీకరించినాడు. కాబట్టియే తిక్కన కవి బ్రహ్మ.

---

# తిక్కన శిల్పరామణీయకత

కావ్యములో అన్నిస్థలములు హృదయమును రంజింపలేవు. కవిని బట్టి కావ్యవిషయమును బట్టి న్యూనాకధికములుగానవి భావుక హృదయమునకు చక్కిలిగింతలు పెటుచుండును. ఈ స్థలములను స్పృశించలేక స్థూల భాగముల నంటి పెట్టుకొని యున్న కవి కావ్యరక్తికి దూరము కాగలడు. ఈ హృద్య స్థలములను స్పృశించగల శక్తి మహాకవికి సహజముగా నుండును. తిక్కనలో నీస్పర్శ జ్ఞానము మెండుగ నున్నది. బృహన్నలను సారథిగా గైకొనుమన్న సైరంధ్రి మాటకు ఉత్తరుడు మొదట పెదవి విరిచినాడు. ఉత్తరుని సైరంధ్రి తుట్టతుదకు అతి కష్టము మీద ఒప్పించినది.

ఈ సారథ్యమునకిక బ్రహన్నలను ఒప్పించవలసి యున్నది. అతనిని ఒప్పించ నడుము గట్టిన వారెవరు? ఆతని ప్రియ శిష్యురాలు ఉత్తర. ఒక బృహన్నలను ఒక డాంబికాగ్రేసరుని సారథ్య నిర్వహణకై గొలుపింగనుట ఎంత ఆనందకరమైన విషయము? ఇది గుడుగుంచముల ఆటవలె ఉన్నది. కొన్ని అమాయికోక్తులు, కొన్ని స్త్రీత్వములు, మరికొన్ని ప్రగల్భములు కలిసి చేయిచేయి కలిపి చెట్టపట్టాలు ఆడినట్లున్నది. బృహన్నలలో నున్నది ప్రచ్ఛన్న వీరము. ఉత్తరుని లోనిది అవీరవరము. ఆ అవీరవరము ప్రచ్ఛన్న వీరమును 'వేరమ్మ మైమఱువుఁ దొడితేరెక్కుము' అంటుంటే ప్రచ్ఛన్నవీరం ఏమి బదులు చెప్పాలి? సిగ్గుతో కుంచించుక పోవాలా లేక సార పిండెలు లేతవి త్రెంచాలా? తిక్కన ఏమి చెప్పించ నున్నాడో మనం ఊహిస్తూరుతున్నాము.

"అనుటయు నాటపాటగల యప్పటికిన్ నను(గోరి పిల్వ(
బంచినదగుఁ గాక సంగరము సేఁతకు సారథిగమ్మ రమ్మ
నీవనుటుచితంబె"

ఇది ఉత్తరునకు బృహన్నల చెప్పిన సమాధానం.

బృహన్నల ఉత్తరుణ్ణి నానా త్రిప్పలు పెడుతున్నాడు. స్త్రీ రూప పురుషుడైన బృహన్నల పురుష రూప స్త్రీ ఐన ఉత్తరుణ్ణి కవ్వించడం బ్రతిమాలించుకోవడం ఎంత బాగుంది! ఏదో పిల్లలకు నాట్యం చెప్పుకునే వాడిని. నన్ను పట్టుకొని సారథ్యం చెయ్యమని చంపుతున్నావు. నీకు తగునా! నా దోవన నన్ను బ్రతుకనివ్వు. ఇది చాల సరసమైన సన్నివేశము.

శిల్పమన నిమ్నోన్నతములను సరి చేసుకొనుటలో గల నేర్పు. సంగీతము ఉచ్చైస్స్వరముల, హీనస్వరముల శ్రుతిభేదమైన కలయిక. చిత్రము తెలుపు నలుపుల చిక్కణ సమ్మేళనములోని తారతమ్య విరచన. ఇది అక్షిగోచరము. కవిత్వము శ్రుతి మనోగోచరము. కవి తన కవితాంశములను నిమ్నీకరించుచు మరొక్కప్పుడు తారస్థాయికి గొంపోవుచు తదంతర రాగతంత్రుల నొక్కటి చేసి ఒక శయ్యకుదార్చును. కవి చేపట్టు శిల్ప రహస్యము లిట్టివనేకములు. కవి కల్పనా సామర్థ్యమున కీపోటుల కవి ఇంగిత జ్ఞానమెక్కువ తోడుపడును. సామాన్య విశేష చంక్రమణము,

వాస్తవికాతి వాస్తవిక సమ్మేళనము, మూర్తామూర్త రూప సంయోజనము ఇవన్నియు ఒండొంటి నొరసి, శిల్పమునకు ప్రాణవంత మొసఁగును. ఈ వైషమ్య స్ఫురణకు ఒక ఉదాహరణము చూతము. ఉత్తరుఁడు కురు సైన్యమును కనుఁగొని భయభ్రాంతుఁడగుచున్నాఁడు. అప్పుడాతని స్థితి ఎట్లున్నది? "గరుపాటిసమేఁగను, దలఁకుసనము" తిచ్చవడిన చూపులునై తొట్రుపడుచున్నది. ఈ శబ్దచిత్రములు అచ్చ తెనుగు పదముల పొందికతో ఉత్తరుని మనస్సులోని తిచ్చపాటువోలె కుందుచు సాగుచూ బెరుకు బెరుకుగానున్నవి. దీనితరువాత, వెంటనే రెండవ పద్యం—

> భీష్మ ద్రోణ కృపాదిధన్వి నికరాభీలంబు, దుర్యోధన
> గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
> లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబు దగ్రధ్వజా
> ర్చిష్మత్త్వాకలితంబు"

ఇది సంస్కృత సమాస భూయిష్ఠము. తియ్యతేట తెనుగు పలుకులను విన్న మన చెవులు ఈ సమాసమువలన ఝుడితాఘాతము తిన్నవి. ఈ సమాసము ఉత్తరుని భయాందోళనమును సూచించుచున్నది. భయంలో దైన్యమూ ఆందోళన రెండు గుణములుండును. ఆందోళన ఆవేగపూరితమైనది. అందువల్ల అది సంస్కృతములో ఆచ్ఛాదితమై ఉండవలెను. దైన్యము పిరికిది. దీనికి కావలసినది మెత్తని తెలుగు పలుకుబడి. ఇట్లు భయమునకున్న రెండు ప్రవృత్తులను రెండు విభిన్న శైలులలో చూపి తిక్కన తన శిల్పములో నిమ్నోన్నత స్థితిని సాధించినాడు.

దైవసృష్టికి ప్రత్యామ్నాయప్రాయమైనది. మానవసృష్టి, మానవ చేష్టితములకు సృష్టిచేష్టితములు ఉద్దీపకములు. సృష్టితత్వములను కవి తన ఉద్దిష్టములకు సంకేతముగా చేసుకొనట మన కవిదితముకాదు. కాని ఏ మహాకార్యమున కెప్పుడీ సృష్టిని ఉపయోగ పెట్టుకొనుటలో సందర్భౌచితి ఉన్నదో సుకవికి తెలియును. అజ్ఞనుడింతవఱకు క్లీబరూపచ్ఛన్నుడు. క్లీబుడు పురుషుడగుట ఒక మెట్టు, తిరిగి పురుషుడు యోద్ధయగుట ఇంకొక మెట్టు. ఈ అవస్థాంతరములను దాటుటకు మందకవికెంతయో కాలము పట్టును. కాని తిక్కన త్వరితగామి. చపుచప్పున శిఖరముల మీదకెక్కవలసి యున్నది ఉత్తరుని వెఱవకుమన్న అని యూవడించినాడు. ఒక

క్లీబుడు వెఱవకుమన్న అంటే భయం పోతుందా? జమ్మివృక్షం చేరువకు వచ్చినాడు. పైన శవపేటికవంటి ఆయుధముల కట్టియున్నది. బహుశా బృహన్నల ఏదేని గారడీ చేయునేమో. ప్రళయకాల సన్నిభమైన యుద్ధ సంరంభమెక్కడ? ఈ క్లీబపురుష క్రియమాణ మింద్రజాలమెక్కడ? కాని దీనిని పాఠకులచేత నమ్మించాలి ఈ కార్యం అతిగంభీరోదాత్తమైనట్లు కనిపించాలి ఇదియొక దైవకార్యమయినట్లు సృష్టికి కూడా సంభ్రమాశ్చర్యాలు కలగాలి. ఈ పరమక్లిష్టమైన వాతావరణమును సృష్టించుటకు తిక్కన హఠాత్తుగా కురుబలమునుంచి ఒక కలకలం బయలుదేరదీసినాడు.

"మానవభోమణిచుక్కలు,గూసెంగలయంగ దెసలకుంబలు సాయల్
సే సెంబలు మొయిలులడరి, ప్రోసెందమయింతేఁ
దూర్యములపధ్వనులై"

ఇదిదైవమానవచేష్టల సన్నిపాతము. సన్నికట సందర్శనము. లౌకికాతిలౌకికముల యీ కలయిక వలన వచ్చిన నిగూఢత కవితను అంతర్నాద సంభరితము చేయును.

అతికథక ప్రవృత్తివద్దనే అతికవి ప్రవృత్తి యుండుటకూడ తిక్కన యొక్క ఉత్థాన పతనాత్మక శిల్పములోని భాగము. వస్తువులను వాస్తవికముగా ఎన్నిన పరిగణన కాగలదు. కల్పనా మూలకముగా ఎన్నినవర్ణన కాగలదు. పరిగణనలో ప్రయోజనముండుట, వర్ణనలో సౌందర్యముండుట అనునది ఈ రెంటికిగల భేదము. ఈరెంటిని ఒక చోటికి తెచ్చుట తిక్కన శిల్పవిశేషము

"అనుచు ధనుస్తూణీర కృపాణ ముద్గరాది వివిధ సాధనంబులు
రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగలెక్కి పగ్గంబుల
గ్రుచ్చి సక్కంజేయు..."

ఇది పరిగణన. ఈ వచనం తరువాతనే

"అభినవ జలధర శ్యామంబులగు నెడలాకు జొంపంబుల ననుకరింప
సాంధ్య రాగోపమచ్ఛాయంబులగు పల్లి కిసలయోత్కరములఁ
గ్రేణిసేయ"

ఇది కురుసైన్యమును వర్ణించిన వర్ణన. పైన వచనములో కొన్ని కస్తురివుల కూడికగలదు. రెండవదానిలో వస్తుచ్ఛాయ గలదు. ఆ వచనములోని తిక్కన కథకుడు. ఈ పద్యములోని తిక్కన కవి.

ఒక్కొకసారి తిక్కన దూది బోరెములవలె పరచుకొనియున్న విషయవైశాల్యములను చటుక్కున పిండి చిన్న ఉండచేసి చేతికివ్వగలడు. బహుప్రకార వ్యాప్తమైన బుద్ధి, కుడ్మలములోని భృంగమువలె సారాంశములో ఒదిగిపోయి కార్యపరిణామ సంయతజ్ఞానమును మనలో భద్రపఱచి ఇచ్చును. ఇది సారవేదియైన కవికి తెలియును. తిక్కన కవితలో నిట్టివి అనేకములున్నవి. ఒక ఉదాహరణము చూడుడు

"కిరీటి శంఖజ్యానాదంబులు సెలంగ గొండొకదవ్వు వెన్నడిం జనియె బిరుదుల తోడి గొడుగులును, పడియాలంబులతోడి సిడంబులును కైకొంచుకొని తృప్తింబొంది మరలువాఁడై...విరాటు తనయునకిట్లనియె,

"పసులుమరలె, శత్రు బలములు పీనుంగు పెంటలయ్యె
రాజుఁబెద్దదొఁగలుఁ
జీరళ్ళాలువబడిరి సిగ్గఱి బిరుదులు, కైచిరింక మగుడవలదె మనకు"

ఇచ్చట దేనికది తెగగొట్టినట్లు చెప్పబడినది. ఇదికుదింపు. స్పష్టీకరణ. పైపైవచ్చిపడుచున్న విషయ పరంపర లొక్కుమ్మడి 'పసులు మరలె' అనుటతో కథాగమనము వేఱొక దిశకు పట్టినది. ఈశైలి కథోపస్కార హేతువైనందువల్లనే గొప్పది కాదు. కవియొక్క సంకోచవ్యాకోచజ్ఞానము మనల నాశ్చర్య నిమగ్నుల జేయుచున్నది.

విశేషమును సామాన్యముతో సమర్థించుట, సామాన్యమును విశేషముతో సమర్థించుట మనకు అర్థాంతర న్యాసాలంకారము, పరిణత ప్రజ్ఞానకవుల శిల్పమంతయు సందర్భమును బట్టి అర్థాంతర న్యాసాత్మకముగనే ఉండును. మనము ప్రత్యక్ష జీవితములో కూడ సామాన్య మెక్కువైనపుడు విశేషముతో కలుపుట విశేషమెక్కువైనపుడు సామాన్యముతో కలుపుట చూచుచున్నాము. విశేషమన పరిమితమైన తత్క్షణానుభూతి. సామాన్యమన అపరిమితమైన గతానుభూతి. ఇవి రెండును ఒకదానికొకటి సమర్థించుచుండును. విరటుడు ఉత్తరుని సమర ప్రకారమడుగుచున్నాడు.

"ద్రోణుడు భీష్ముడుం గృపుడు ద్రోణ సుతుండును గర్ణుడుం బరా
త్రాణపరాయణత్వమున దర్పసముజ్జ్వల భంగి" అని
ఒక్కొక్కరిని వివరించి చెప్పినాడు తరువాత
"బాసటలేక క్రొవ్వడర బంటుతనంబునఁ దాకి తేనియున్
బాసిన చోటు వాయుఁ బెఱ ట్టుల వీరులు పగ్ర వృత్తిమై
మూసికొనంగ నస్త్రగోష్ఠి"

అని సామాన్య పరిస్థితిని ఉట్టంకించినాడు. సామాన్య విశేష సాహచర్యమువలన కథ్య విషయమునకు బలము చేకూరును. వస్తువిశేష జ్ఞాన మెక్కువయున్న వర్ణనాశక్తి యుండును. సామాన్య కథనము చేయగలిగిన కవిలో లోకానుభవ ముండును. ఈ రెండు గుణములను, యథాప్రకరణముగా తిక్కన తన కావ్యములో పొందు పఱచినాడు. కావ్యములో అతి ముఖ్యమైన ప్రక్రియ అతివాస్తవికత లేక అవాస్తవికత. అస్పృశ్య జీవితము కళకు రుచించును. కల్పనా మూలకముగా కవి ప్రత్యక్షానుభవములను మరుగు నమన్న విషయములను కదిలించి మనోమాత్ర స్పృశ్యములు చేయును. ఇగి అవాస్తవికత. అపచేతనాజన్యము. ఇదిగాక అతివాస్తవికతయని వేఱొకటు న్నది. అతివాస్తవికత అన సాధారణ వస్తువులను ఉత్తేజకరముగ చూపుట లేక ఉత్తేజకరమైన దశలో చూపుట. దీనినే పూర్వులు స్వభావోక్తి అలంకారమనిరి. ఇది కేవలము యథాతథ చిత్రణముగాదు. తిక్కనలో అతి వాస్తవిక చిత్రణలు మిక్కుటముగా నున్నవి. ఈ క్రింది పద్యము గమనించ దగినది.

కురురాజున్ సబలంబుగాఁ గవిసినన్ ఘోరాహవంబయ్యెనం
దరదంబుల్ నుఱుమయ్యె నశ్వములు నుగ్గయ్యెం గరివ్రాతముల్
ధరదంతంబుల యూఁతగా నొఱగె నుద్యద్బాహు దృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం దద్బాణ పాతంబులన్.

దీనిలోని దృశ్యం వాస్తవికంనుంచి అతివాస్తవికంవైపుకు మెల్లమెల్లగా జరుగుచున్నది. అరదములు నుఱుమయ్యెను. అశ్వములు నుగ్గయ్యెను. ఇక్కడ పద్యరచనలో నకృద్ప్రహక్రియా పతనమువల్ల ఒక ఉద్వేగము కలుగుచున్నది. దీనిని మించిన ఉత్తేజన ఏనుగుల విషయములో చెప్పబడి నది. కరివ్రాతములు భూమిమీద దంతములఊతతో ఒఱిగిపోతున్నవి. ఇట్టి

సహజ ప్రయోగమును తిక్కన మాత్రమే చేయగలడు. ఏనుగులు యుద్ధరంగములో దంతముల పట్టుతో ఒరిగిపోవడం వంటి చిత్రణలను కనుల కట్టింపజేయు శక్తి స్వయముగా యుద్ధరంగమున కాలుమోపినవానికే సాధ్యమగును. ఇట్టిదింకొక చిత్రణ. అర్జునుడు రణక్షోణిలో సంతత బాణధారా పాతము గావించుచున్నాడు. అందు మేలుకర దీర్ఘశరంబగు, నాదం బెడతెగక గుణమునను వడి నిగుడం, గోదండము సంతత వలయోదాత్తస్ఫురణ వెలుగొందుతున్నది. అర్జునుడు బాణములు వేయుచున్నంత వఱకు అతని ధనుస్సు వలయాకారమును వీడుటలేదు. ఇది అతి సహజమైన చిత్రణ. ఇట్టి యనేక చిత్రములతో తిక్కన తన కవితలో నిమ్నోన్నతములను సాధించి తన కృతిని అత్యుత్తమ మొనగించినాడు.

---

# తిక్కన స్త్రీ సహజ స్నిగ్ధహృదయుడు

తిక్కనలో తెనుగు నుడికారమధికము. ఈ నుడికారమునకును ఆయన హృదయమునకును నడుమ నేమైనా బాంధవ్యము కలదా! కలదు. ఆయన నుడికారము ఆయన బాహ్య ప్రవృత్తి. ఆయన ఆత్మకూడా ఆనుడికారమునకు సంబంధించినదే. ఆయన ఆత్మలో తెనుగున్నది. తిక్కన నిసర్గ ప్రవృత్తి కఠోరముకాదు. ఒకవేళ కఠోరమైనను పురుష కఠోరము కాదు, స్త్రీ కఠోరము. తిక్కన తెనుగు నెక్కువ ఏలవాడినాడు! తెనుగు సంస్కృతిని వాడినాడు గాబట్టి. ఆ తెనుగు సంస్కృతి ఎట్టిది? తెనుగు దేశమునకు సంబంధించినట్టిది. తెనుగు ఇల్లాలు, తెనుగు భామ, తెనుగు కోపన, తెనుగు ముద్దరాలు, తెనుగు పేరంటాలు. తెనుగు అమ్మలక్కలు. వీరి నుండి తిక్కన నుడికారము మొలిచినది. పురుషపాత్రలు కూడా తిక్కనకు స్త్రీపాత్రలే. ఆశ్చర్యము. తిక్కన స్త్రీసదృశ హృదయుడు. ఆసాదృశ్యము ఎట్టిస్త్రీలతో? బాల, ముగ్ధ, విలాసిని, ప్రణయిని. విరాగిని వీరు కాదు. వీరు భావాత్మికలు – అనగా రోమాంటిక్ స్త్రీలు. తిక్కన

స్త్రీ ఇందుకు పూర్తిగా భిన్నము. ఈయన స్త్రీ లోక ప్రవృత్తిగతమైనది. అనగా భామ, ఇల్లాలు, పేరంటాలు తిక్కన యొక్క యీ భామా హృదయము, ఆయన పురుషపాత్రల యందును ప్రవేశించినది. అతనిని తెనుగు లెంక చేసినది. అతనికి నాటక పద్ధతి నిచ్చినది. అతనిని జీవత్కవిని చేసినది. తిక్కన యొక్క ఈ భామా హృదయమునకు ఈ మాటకారితనమునకు ఈ పేరంటాలిగుణమునకు ఆతని భారతమంతయు సాక్ష్యము.

కళ బలహీనతలలోనుండి పుట్టును. అందువలననే పురుష కవికి స్త్రీ కళాపరిధి. మానవ జీవితములో నున్న బలహీనతలన్నియు కళావిషయములు కావచ్చును. ఆరాశిని ఒకేచోట చూడదలచిన స్త్రీని చూడవలయును. పురుషుడు ధ్వంసము చేయును. ఇక్కడ కవిత్వము లేదు. ధ్వంసావశేషముల మీద స్త్రీ కన్నీరు కార్చును. ఇక్కడ కవిత్వమున్నది. స్త్రీ పురుషుల కిద్దరకును లోక గతమైన రూపము, భావనాగతమైన రూపము అని రెండు రూపములున్నవి. పురుష పరముగా లోకగతమైన రూపము అధికారము, రాచకార్యము, ధర్మనిర్వహణము, కీర్తికాంక్ష, మాటకారితనము మొదలైనవి. స్త్రీ పరముగా ఇల్లుదిద్దుట, ప్రక్కయింటి వారితో ముచ్చట్లు చెప్పుట, బుద్ధులు గఱపుట, ఇంటి పెత్తనము వహించుట, పిల్లలను సాకుట, కోడండ్ర తగాదాలు తీర్చుట మొదలైనవి. స్త్రీ పురుషుల మూలవృత్తి లోకరీతి యయ్యును అలవాటులబట్టియు, పని తీరులబట్టియు, పెరవు, పెంపు, పోడిమి, లావులబట్టియు భిన్నములు. ఇవి అభివ్యక్తికి సంబంధించిన విషయములు, కళారహితమైన కవితాభివ్యక్తి స్త్రీ పురుషులలో నిట్లుండును. స్త్రీకి పురుషునిపై ప్రేమ కలిగినదనుకొందము. అప్పుడామె కన్నులు సిగ్గుతో వంచుకొని పోవును. చూపులలో వాలుందనము కొట్టవచ్చును. నడకలో తొట్రుపాటు, నడుములో తూగిస వచ్చును. ఇవి స్త్రీ గతములైన ప్రేమాభివ్యక్తులు. పురుషునకు స్త్రీపై ప్రేమ కలిగిన అతనిచేయి మీసము మీదకు పోవును. గొంతు సవరించుకొనును. విహసితము చేయును. మీద మీదకు బడును. ఇవి పురుషగతములు. వీతద్భిన్నములైన లోక ప్రవృత్తులు స్త్రీ రూపమున తిక్కనలో తొంగి చూచినవి. అభివ్యక్తియే కవిత అయిన యెడల తిక్కన కవిత భామా హృదయముతో గూడిన స్త్రీగతమైన అభివ్యక్తి. ఈ ప్రవృత్తి ద్వారముననే తిక్కన చేత తెనుగు సంస్కృతి చెప్పబడిన. రాయబారము నడుపబడినది. సంధి విగ్రహములు

చేయబడినవి. కీచకుడు సర్దింప బడినాడు. ఉత్తరా వివాహితయైనది. ఇవన్నియూ ఈ భామా ప్రవృత్తితోడనే జరిగినవి.

స్త్రీ పురుష ప్రవృత్తులను రసపరముగ చెప్పినయెడల వీర రౌద్ర భయానకాదులు పురుషగతములు. శృంగార కరుణములు స్త్రీ గతములు. భయానకము తిరిగి పురుషజన్యమై స్త్రీ పరముగా అను భూతిని పొందును. భయానకములోనున్న ఈద్వైధ ప్రవృత్తి కరుణములోనుండదు. కరుణము స్త్రీ ప్రవృత్త్యేక భోగ్యము. శృంగారమునకు అధిష్ఠాత్రి స్త్రీ. లోక వ్యవహారమును దాటి హృదయానుభూతి వఱకు తేబడినవియే రసములగును. రసస్థితికిరాని వ్యవహారములు కావ్యములందు వివరింపబడియు రస స్థాపకములు కావు. 'ముద్రారాక్షసము' ఒక రాజ్య తంత్రమునకు చెందిన నాటకము. ఇట్టినాటకములందు బుద్ధియొక్క కుమ్మక్రీడలకవకాశ మెక్కువ యుండును. ఎక్కడనో గాని హృదయ స్పర్శ తగులదు. అందువలన కవులు లోకవృత్తములను లోకపరిధుల నుండి దాటించి రసస్థితికి తెచ్చుటకు నారీహృదయాలు కాక తప్పదు. కాళిదాసు నారీహృదయుడు. భవభూతి నారీహృదయుడు. కాని కాళిదాసునిది ప్రణయినీ వియోగినీ గతమైన నారీహృదయము. భవభూతిది కరుణనారీహృదయము ఈ రెండు. ప్రవృత్తులకు భిన్నమైన నారీప్రవృత్తితో తిక్కన వీరికి భిన్నుడు. ఇది భామా ప్రవృత్తిగావున, ఈ భామా ప్రవృత్తికి తెలుగు సాహిత్యమునందు నేగాక సమస్త భారత సాహిత్యమునందును కూడ తిక్కనయే ఏక మాత్ర ప్రతినిధి. సూరదాసు హిందీలో వాత్సల్యమునకు ప్రతినిధి. అట్లే తిక్కన తెలుగు సాహిత్యములో భామా ప్రవృత్తికి. తిక్కనయొక్క ఈ నారీహృదయమును కొన్ని ఉదాహరణములతో వివరింతును.

గోవులను పట్టుకొనుటకు తన తనయుడు వెళ్లినాడని తెలిసిన విరటుని భయాందోళనను చూడుడు. విరటుడు రాజు, క్షత్రియుడు. కొడుకు యుద్ధమునకు వెళ్లినను వార్త విరటుని కలవరపరచినది. గద్గోలుపడినాడు. ఆయన ఆక్రందన ఇది.

> "పసులకుఁ గూయిగా జనియెఁ బాపడు కౌరవసేనయేడ
> యొంటి పసుటయేడ నాకిది గడంది విచారము పుట్టె"

విరటుని యీ యారాటములో క్షత్రియోచితమైన ధీరచిత్తతగానీ కనీసము రాజోచితమైన గాంభీర్యముగాని లేదు. ఇది చక్రవర్తియొక్క గూఢమనోవేదనయూ లేక స్త్రీ యొక్క భరించ శక్యముగాని ఆక్రందిత హృదయోద్గత దీనాలాపమా! ఈ దీనాలాపమును సంస్కృతపద బంధురమైన శైలిలో చూపిన నెట్లుండెడిదో గాని తెనుగునాట తెనుగు కంఠములో రసీభూతములైన అచ్చ తెనుగు పదములలో చూపినందువలన ఒక తెనుగు తల్లి తన బాలుడు యుద్ధభూమి కేగునప్పుడు చేయు ఆర్తాలాపమువలె నున్నది. ఇదియే తిక్కనలోని కళావేత్తృత్వము. హృదయమును బ్రద్దలు కొట్టి బావురుమనిపించు కళావిజ్ఞత. ఇచ్చట పాత్ర పోషణము దెబ్బతిన్నదన్న ప్రసక్తియే లేదు. ఏలనన తిక్కన పాత్రల వ్యక్తిత్వమును పునస్కరించి చూపుటకు కథా బద్ధములైన, బాహ్య చిహ్నములను ప్రోదిచేసియు, సర్వమానవ హృదయములను చొచ్చుకొనుపోవు ఘట్టములందు మాత్రము నారీ హృదయమునే బయల్పఱచును.

తిరిగి విరటుడు కంకునితో నిట్లనుచున్నాడు.

"నాకొడుకు పోటుమాటలు, నీకేటికిఁ బొసఁగ నాడ నేరవు మాఖ్యో
ద్రేకమునఁ బలుకుచుండుట, మాకు సహింపంగరాదు. మానుము
విప్రా!"

ఇది అధికారదంభము కలిగిన యొక తెనుగుభామ తనయధీనమున నున్న యొక పెద్దమనిషిని మాటవిరిచి పాడిచినట్లున్నది. నీకంత అనూయ యెందుకు బాపడా! మూర్ఖతనముతో పలుకుచున్నావు. మాకు సహింపంగరాదు మానుము విప్రా! అన్నచోట సహింపగరాదు వద్ద తెలుగు ఇల్లాలు కొంచెం దీర్ఘం తీసికూడా దెప్పినట్లున్నది. ఆ తెలుగు వాక్యం త్రిప్పుడులో తెలుగుతనం ఎంత జీర్ణించియుంది!

ఒక మహాత్ముడు యుద్ధములో సాయపడి ఈ గోవులను మరలించి తెచ్చెనని ఉత్తరుడు చెప్పగా విరటుడు

"ఎచ్చోటు నున్నవాఁడతఁ డిచ్చోటికి నేల రాఁడొ యిప్పుడు" అంటున్నాడు. ఈ విరటుని ఉత్కంఠలో పరమశ్రద్ధాళువైన తెలుగు ఇల్లాలే కనిపించుతుంది. ఆవేగిరపాటు, ఆఅతిథి సత్కారకాంక్ష, ఆ

సమ్రమత, ఇందులో విరటుడు కనిపించుతున్నాడా? లేదు. ఒక వృద్ధురాలు, ఒక గృహిణి ఇష్టదైవతానికి నైవేద్యం సమర్పణంచేసి చల్లగా నిట్టూర్పు విడిచి, అతిథులకోసం బయటి గుమ్మందాకా వచ్చివేచిన తెలుగు ఇల్లాలు కనిపించుతుంది.

చివరి ఘట్టము అత్యాహ్లాదకరమైనది. పంచపాండవులు తమతమ మరుగూపులువీడి బయల్ వెలసినారు. విరటుని ఇల్లు పండువెన్నెల విరబోసినట్లున్నది. ఉత్తరుడు వాళ్లతో నేకీభవించిపోగా విరటుడొక్కడే బిక్కబిక్కుమని చూస్తూ కూర్చొనియున్నాడు. ఈ ఒంటరితనం ఎంత సేపు? ఉండబట్టలేక "ఏననవేల యొక్కడెనా యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం గానన దేశవాసములఁగాఁతియ కోర్చి యడంగియుండి" అని ఎలిగెత్తి అడిగినాడు. పాపం ఇంతెల్లపాదీ విజయోత్సవానందంలో తెందెప్పలు తేలుతుంటే విరటుని ఆత్మ ఎంతగా నొచ్చుకుందో! ఆబాధనంతా వైపద్యంలో తిక్కన తన స్త్రీ సహజస్నిగ్ధ హృదయ మార్దవంతో చూపించి మనలను రసానందమున నోలలాడించుచున్నాడు.

తిక్కన తన పాత్రలను ప్రాణవంత మొనర్చుటకు స్త్రీ ప్రసంగముల సహాయమునే కోరును. తరువాత రెండవ పక్షములో లోకము వారలను కలుపుకొనును. ఒకటి ముందు తన హృదయములో స్త్రీని ప్రతిష్ఠించుకొని, రెండవది లోకమర్యాదను పురస్కరించుకొని. నిజమునకు మానవుని విలువలు పరీక్షించుటకు స్త్రీభావన యొక గీటురాయి. ఇది సూక్ష్మమైన, ప్రాకృతికమైన, అంతరాంతరములలో ఉన్న మెత్తని పొరలను తూచెడి సన్నని తూనిక ముల్లు. లోకము బయటికి కనుపించు త్రాసు. ఒకరకముగా తిక్కన స్త్రీలోపల ఉండి మరొక రకముగా స్త్రీకి వెలుపట ఉండి స్త్రీ శక్తిని వినియోగించుకొనును. ఈ క్రింది పద్యము చూడుడు.

అంతిపురంబులోనగల యంగనలెల్లను నెమ్మనంబులన్
సంతస మందగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూనినీ
వెంతయుఁ బేటివై యరదమెక్కి రయంబున వచ్చియిచ్చటన్
దంతి తురంగ సద్భట కదంబముఁ జూచి కలంగు టొప్పునే.

స్త్రీ ప్రసంగముతో నిట్లు ఉత్తరుని రెచ్చగొట్టి 'లోకము చక్కటివి కూరుతైన దీనిని మదిమెచ్చరు' అని లోకప్రవాదమును కూడ ఊతగా గొనినాడు. నిజమునకు ఈ లోకభీతి కూడ స్త్రీ సహజమైన గుణము. ఈ ప్రవృత్తిని ఇక్కడ ఒక మహా చక్రవర్తి విరటునిలో చూడగలుగుట ఆశ్చర్యము. ధృతరాష్ట్రునిలో కూడ నిట్టి గుణమే కనబడును. వయస్సులో పెద్దవారగుట వలన ధృతరాష్ట్ర విరటులలో కనిపించిన ఈ భామా ప్రవృత్తికి పెద్ద ఆశ్చర్యము కలుగకపోవచ్చును గాని అరివీరభయంకరుడు, అతి కష్టాత్ముడు అయిన దుర్యోధనునిలో కూడ ఈప్రవృత్తి కనుపించిన మఱింత ఆశ్చర్యము కలుగును.

తనను యుద్ధరంగములో నిర్దాక్షిణ్యముగా వదలిపెట్టి వెళుతున్న భీష్మద్రోణాదులను చూచి దుర్యోధనుడు కడుదైన్యముగా నిట్లను చున్నాడు.

"లోకంబు తోడివారుగ, మీకుం జనునయ్య మగఁటిమిని గుటిగాదే,
నాకడరైన యొడందగఁ జేకొనియది మీరు చక్కఁజేయుట యరయన్.

లోకంబు తోడివారుగ మీకుం జనునయ్య అనుటలో ఎంత జేలతనము ఎంత సిగ్గఱితనము, ఎంత నిస్సహాయత దాగున్నది?

యుద్ధమువంటి భీకరఘట్టములలో కూడ తిక్కన స్త్రీ సహజ ప్రవృత్తిని వీడలేదు. యుద్ధమన కేవలము మారణవిద్యగాదు. యుద్ధమునకు ముందున్న కారణములు, యుద్ధకాలములో జరుగుచున్న సంచలనము, యుద్ధము జరిగిన తరువాత దాని పర్యవసానము, ఇవన్నియు కలిసి యుద్ధము. అందువలన యుద్ధమునకు సంబంధించిన జడభాగములను తీసి వేసి యుద్ధములోని చేతన భాగములతో సంబంధమున్న స్థలములను చూచిన మాత్రము తిక్కన నారీహృదయముతోడనే సాక్షాత్కరించును. అర్జునుడు దుర్యోధనుని ఎత్తి పొడుచుచున్నాడు.

"క్షత్రియుఁడోడునే తగదు కౌరవరాజ!" "ఏనుంగునెక్కి పెక్కేనుంగు లిరుగడరాఁ బురవీధులఁద్రాలఁగలదె" ఇది ఎత్తిపొడుపు. బెదిరింపుగాదు. పురుషుల యుద్ధములో బిభీషికలు, వికటాట్టహాసములు, పటా

టోపములు, బెదిరింపులు ఉండును. స్త్రీల పోట్లాటలో మూతివిరుపులు, ఎత్తిపొడుపులు, సాధింపులు, తిట్లు ఉండును. తిక్కన యుద్ధములో ఈ ఎత్తిపొడుపులు తిట్లు మున్నగునవి ఎక్కువయుండును. అట్లని పురుషోచితములైన యుద్ధసంరంభములు బొత్తుగా లేవనికాదు. మానవ హృదయతలములను దరసికొను సమయమున మాత్రము తిక్కన స్త్రీ పక్షమునే వహించునని చెప్పుట నా ఉద్దేశ్యము. స్త్రీ పురుషుల పోరాటములో ఈ విధమైన తేడాలను గమనించుటకు మనశ్శాస్త్రసహాయమవసరము. పురుషుడు అహంకారి. తనశక్తిమీద తనకు నమ్మకముండును. అతనికి లోగడజేసిన ఘనకార్యములనే స్మరించి చెప్పనవసరముండదు. అతని అధిక్షేపణలలో వర్తమానము, భవిష్యత్కాలమే ఉండును. స్త్రీల ఎత్తిపొడుపులో భూతకాలముండును. స్త్రీఎత్తిపొడుపు ఒకరకంగా objective పురుషుని ఎత్తిపొడుపు subjective "నేను నిన్ను ఏమిచేస్తానో చూడు", "మావారు ఏమిచేస్తారో చూడు" ఈ రెండుమాటల్లోనూ తేడాఉన్నది. కీచకుడు సైరంధ్రిని వెన్నంటినప్పుడు ఆమె బహుశా ఈమాటనే అంటుందికాబోలు. స్త్రీ ప్రవృత్తిని చేపట్టిన కవికి విషయమెక్కువ దొరకును. పురుషప్రవృత్తి కవి వస్త్వభావము వలనను, వస్తువు దొరకినను అది శుష్కమైనదగుట వలనను చాలా ఇరకటములో బడిపోవును.

పోతే తిక్కన, రాయబారములో రాజకీయదక్షతచూపెనని వినికిడి. అప్పుడుకూడ నాకు తిక్కనలోని స్త్రీలే కనిపించుచున్నారు. ద్రౌపదిలో కోపన, చండి, దుర్యోధనునిలో పెంకిపెండ్లము. కృష్ణునిలో తీర్పుగత్తె మాటకారి అయిన తెరవ. ధృతరాష్ట్రునిలో సణుగుతున్న అవ్వ, కుంతిలో, గాంధారిలో సెలకువ కలిగిన, వయస్సుమళ్ళిన మగువలు, ఇంకెందఱో కనుపించుచున్నారు. ఉద్యోగపర్వములో రాయబారమును నడపినది కృష్ణుడుకాదు, స్త్రీ-ఒక అనుభవజ్ఞురాలైన స్త్రీ 'పాండవులు దండ్రి సచ్చిన వారు' అని జాలిగలుగజేయును. 'సారపుధర్మమున్ విమల సత్యము' అని నీతి గఱపును. 'వారితండ్రి పాలు వారికిచ్చి' అని భాగములు తెగగొట్టును. 'పగవారియింటు గుడిచిన' అని సరిపడని విందునుంచి తప్పుకొనును. 'తనయులుఁగోడలు నేచుంబున నున్నారని' ఊఱడించును. ఇవన్నియు అవగాహన చేసుకొనిన కృష్ణుడు రాజకీయ మర్యాదలతోగాక గృహమర్యాదలతో రాయబారమును నడపినాడని తెల్లమగును. చెప్పదలచినది

స్త్రీనిర్మాణముచేసిన కవికి చాలినంత సామగ్రి లభించును. పురుషుడంటే ఒక్కడేగాని స్త్రీతోపాటు ఎంత ఉన్నది? పిల్లలు, భర్త, పుట్టినిల్లు, వంశము, మర్యాద, అతిథులు, ఇరుగు పొరుగువారు, పండుగలు పొట్లాటలు-ఎంతో క్రిక్కిరిసిన జీవితము స్త్రీజీవితము. పురుషుడు చేయు పనులు కావ్యమున కెక్కువ ఉపయోగపడవు. రాజకీయం. ధర్మనిర్వహణ, విధినియమములు, గాంభీర్యము, పటాటోపములు దేశోద్ధరణ, ఉపన్యాసములు, ఇవి కవితా సామ్రాజ్యమునకు దరిదాపున ఎల్లలుగా నుండవలసినవే గాని సింహాసనము మీద కూర్చొన గలిగినవి కావు. ఆకూర్చొన గలిగినది నారీహృదయ మొక్కటే. పూర్వకాలమున కవికలమునుండి జీవితము ప్రతిబింబించినదన అది గృహ జీవితమూ, సామాజిక జీవితమేగాని రాజకీయ జీవితముగాదు. అప్పటి రాజకీయమున రాజు, కొందఱు మంత్రులు, ఇంకొంత అతని పరివారము తప్ప పెద్దనిడివి గలిగినదిగాదు. అది రాజకీయవేత్తకు కొంతవఱకు కార్యవేదిక అయినదేమోగాని సాహిత్యవేత్తకు తగినంత సంభావమును గూర్చలేదు. అందువలన అప్పటి కవులు రాజకీయమును గృహపరముగనే చెప్పినారు. తిక్కనకూడ కృష్ణుని రాయబారమును గృహపరముగనే తీర్చిదిద్దినాడు, తెలుగుదేశమున ఇద్దఱన్నదమ్ములు భాగములు తెగకపోరాడుకొని కొట్టుకొని చచ్చి మిగిలినవారు రాజ్యమునుచేసిన విధముగనే భారతము రూపొందింపబడినది. తిక్కనయొక్క భారత రచనా శిల్పమునకు స్త్రీ హృదయమే గీటురాయి. ఈ స్త్రీ హృదయమును గ్రహింపగలిగిననేగాని తిక్కనలోని తెనుగుతనము, తెనుగు నుడికారము, ఆయన నాటక పద్ధతి ఇంకా ఆయనకున్న సమస్తమైన గొప్పతనములు బోధపడవు.

## ఉత్తరుడు

ఉత్తరుని భీరుత్వమును తిక్కన మిక్కిలి రసవత్తరమైన ఘట్టములనుండి బయల్వెడల దీసినాడు. ఉత్తరుని డాంబికోపన్యాసములకు శ్రోతలెవరు? సైరంధ్రి, ఉత్తర, బృహన్నల. భీరుత్వము అబలాగుణము. ఈ గుణము పౌరుషోపేతములైన వాతావరణములలో రాణించలేదు. అచ్చట భీరువుల ప్రసంగములకు చెవియొగ్గు వారరుదు. డాంబికోపన్యాసములకు అనుగుణమైన పరిస్థితి ఉత్తరునకు సులువుగా నొనగూడినది. గోవులను

విడిపించితెచ్చుటకు వీట నెవ్వరునులేరు. స్త్రీలు, స్త్రీసదృశులు మాత్ర
మున్నారు. వీరియొక్క డాంబికములు రాణించినవి. కవి ఉత్తరకుమారుని
యొక్క పుంస్త్వగతమైన స్త్రీ ప్రవృత్తిని స్త్రీల యెదుట ప్రదర్శించి
పిఱికితనము పోవు వింత క్రీడలు మనకు చూపెట్టినాడు.

ఉత్తరుని అధీర హృదయములోని వివిధదశలు తిక్కన శిల్పసామ
ర్థ్యము ద్వారా వింతనడలు పోయినవి. మొదటిది ఆరంభ శూరత్వము.
రెండవది కురుసైన్యమును చూచినప్పటి భయవిహ్వలత. మూడు అర్జునుని
నిజస్వరూపమును గుర్తించుకొని విస్మయదశ. నాలుగు బంధువుల నడుమ
తన్నుదాను మఱచిన ఆత్మైక్య భావము. ఉత్తరుని వంటి భీరుహృదయము
కావ్యమునకు చాలమెత్తనిచోటు. కావ్యత్వము మానవ హృదయముల
మెత్తందనముల నుండియే విరియునుగదా! ప్రగల్భములు, డాంబికములు,
అచ్చెరువులు, ఆప్యాయతలు ఇవి రసస్ఫూర్తికి ఆటపట్టులు. భీరువులు
స్వీయ వ్యక్తిత్వము కోల్పోయి యుందురు కాబట్టి వారు క్షణికోత్తేజము
పొగడ్తలనుండి పొందుదురు. పిఱికితనమునకును, పొగడ్తకును బహు
దొడ్డచెల్మి. గవాధ్యక్షుడు పరుగు పరుగున వచ్చి గోగ్రహ వార్తను
వినిపించి ఉత్తరునకు పురిరెక్కించినాడు. "విరటుడు విన్నచెప్పఁబడి
వేవుర ముందటఁ జెప్పు" అన్నగవాధ్యక్షుని మాటతో ఉత్తరుడు
త్రాగినవాడు తూలినట్లు తూలినాడు. తన తండ్రి అందరిలోను చెప్పు
కోవడంకంటె గొప్పమాట ఏముంటుంది పిఱికి పుత్రునకు. వెంటనే
ఉత్తరుడు 'నాకు సారథి లేకపోయెనే ఉన్నట్లయితే వీళ్లపని పట్టేవా
డిని అనిఅనెను పిఱికితనంతో పాటు దానికితగిన చెలికత్తెలుకూడా ఎక్కువ.
సారథి లేకపోయినందుకు ఒక విసగటు బృహన్నలను సారథిగా చేసు
కొమ్మంటె ఇంకో ఈసడింపు. "బృహన్నల సారథియైన దీని నవ్వరె"
ఈ పేడివాని సారథ్యమేమిటి? పురజనులు నవ్వుతారు. ఇలా బృహన్నలను
ఎగతాళి పట్టించాడు. ఎలాగైతేం చివరకు ఉత్తరుని ఈ మనోవిచికిత్స
లన్నీ ఒక సమాధానాన్ని పొంది "హయములఁ బూన్పుము రథమున,
వేగమున నిడ మొత్త మిపుడ రావలయును" అని ఆరంభోద్యోగము చూపి
నవి. తిక్కన ఉత్తరుణ్ణి ఇంతవఱకు డాంబికునిగానే రూపొందించినాడు.
ఇతడు ఒట్టి అమాయకుడైన డాంబికుడు. యుద్ధమంటే ఏమిటో తెలియని
అర్భకుడు. మంచి సారథి లేడని సాకులు పెట్టడం కార్యాన్ని తప్ప

జేయుటకుగాదు. ఇతడు వ్యర్థడాంబికునిగా కపట శూరునిగా ఆద్యో పాంతము చిత్రించ తిక్కన అభిప్రాయమై యుండిన యెడల చివరి కొనకూడిన బంధు సమాగమములో ఔచితి ఉండెడిదేకాదు. యుద్ధ భయంకరత్వం తెలియక ప్రయాణం కట్టినవాడేగాని తెలిసి మోసపుచ్చ జూచిన కపటికాదు. అతనిలో బంధుప్రీతి మిక్కుటముగా నున్నది. ఉత్తర గోగ్రహణములో ఉత్తరుని నాయకుడుగా చేయగలిగిన ఉత్తమో త్తమమైన గుణము ఈ బంధు ప్రీతియే. బృహన్నలను పాండవ మధ్యము డనిగుర్తింగని ఉత్తరుడు పాండవులను తెలుసుకొనుటకు ఉవ్విళ్లూరు చున్నాడు.

> "ఈ యెడనిట్టిమ్మహానీ యాయుధములువెట్టి. యెచటికరిగిరి,
> మన కౌంతేయులు బృహన్నలా! తగ నీవెఱింగిన యంతవట్టు
> నిక్కము సెపుమా!

ఈ ప్రశ్న ఉత్తరుడు సస్నేహంగానూ, సగౌరవంగానూ, సవిషా దంగానూ, అడుగుతున్నాడు.

'ఏ నమ్మహానుభావుల మేనల్లుడ' అని ఎంతో మార్దవంగా అన్నాడు. పైచెప్పిన స్నేహ, గౌరవ, విషాదాలు మూడును ఉత్తరుని పలుకులో ఎలా ఒదిగిపోయి యున్నవో అట్లే అతని శీలములో కూడ ఒదిగినవి. కురుసైన్యమును జూచునప్పటి ఉత్తరుని భయాందోళనము భీరుసహజము. భీరుత్వము వెనుకనే దీనత్వముండును. సైన్యదర్శన విభ్రాంతుడైన ఉత్తరుడు "నాతోడి ప్రేముడింగడు నాతురనై యెదురు చూచు నంబకు" ననునప్పటి స్థితి చాల దయనీయమై మాతృప్రేమను శరణు జొచ్చినది. ఉత్తరునిలోని డాంబిక ప్రవృత్తి యాదృచ్ఛికము. సహజము కాదు. నగరిలో కురుసైన్యముల నెదుర్కొనువారు లేని కారణమున నాత నిలో యుద్ధావేశము విజృంభించినది. తిరిగి బృహన్నల నగ్నబాహు పరి ష్వంగములో దాగి ఊరటజెందినది.

కురుసైన్యము ఓటమి జెందువరకు గల యుత్తరుని ప్రవృత్తివిస్మయ కారకమైనది. కాని యాతని నిజమైన రూపము గోవులను మరలించి ఇంటికి తిరుగు ముఖమైనతతి కన్పించును. ఇప్పుడాతనికి డాంబిక గుణ ప్రదర్శనావశ్యకతలేదు. మెచ్చుమెచ్చు మాటలు విని వినిపించు నవసరము

కూడలేదు. అతని అర్భకత్వము, పిరికితనమూ రెండునూ అర్జునుని బాంధ
వ్యములో తాదాత్మ్యము పొందినవి. ఇప్పుడతడు నిజమైన బంధువు.
"నిన్నెఱుంగక యేనేమేనన్న పలుకులెల్ల మఱచి" అని మొదటనే కృపా
భిక్ష యాచించినాడు. ఇరువురు ఒకటైనారు. రథికసారథులు కారిప్పుడు
వారు. బంధువులు. ఈ బాంధవ్యము మీదనే ఉత్తరగోగ్రహణము ఆధార
పడి యున్నది. ఉత్తరగోగ్రహణములో యుద్ధమునకు సంబంధించిన గాథ
కొంచెము దీర్ఘమైననూ గౌణము. ఈకథ ఎక్కువ సేవ్యసేవక విపర్యాస
మునకు సంబంధించినది. అజ్ఞాతవాసోద్ఘాటనముచేసి ఉత్తర వివాహమునను
సంధింప బూనుటకే ఈ కథాంశములు ఆయత్తపరుపబడినవి. వీటి పూర్తి
సాఫల్యమునకు కుదురు ఉత్తరుడు. తిక్కన ఉత్తరుని పాత్రను హేయ
ముగా గాని అపహాస్య జనకముగా గాని సృష్టించలేదు. నలుగురి నోట
బడి, తోడివారలలో అపహసింపబడి, రచ్చకీడ్వబడి ప్రగల్భములకు ఫలి
తము ననుభవించి వ్యర్థుడైన ఉత్తరుని ఇందు చూడము. ఉత్తరుని పాత్ర
చాల సహజమైనది. పరిణామ సుందరము. అతని పిరికితనము కూడ ఏ
ఇద్దఱి ముగ్గురకో అదియును తప్పనిసరియై తెలిసినది. అనగా కుటుంబ
పరిమితము (In door). పని గట్టుకొని తిక్కన ఉత్తరకుమారుని భీరువు
చేయలేదు. తన కథా వివృతిలో కొన్ని హృద్యస్థలములను చేర్చుటకే ఈ
పాత్రము ఈ రీతిలో సృష్టించుకొనినాడు. ఈ కథలో పాత్రలు ప్రధా
నములుకావు. ఘటనల ప్రాధాన్యమెక్కువ. కథ వీరరసాంతము. కాని
స్పష్టమైన వీరుడు లేనందున కొన్ని ఆశ్చర్యములూ, వింతలూ, ఔత్సుక్య
ములే కథను నడిపించినవి. ఒక కార్యసాధనలో ప్రముఖ పాత్రి
బృహన్నల. వేఱొక కార్యసాధనలో ప్రముఖ పాత్ర ఉత్తరుడు. విరటుడు
దీనికి సాక్షి. అనిమేషచక్షువులతో నాటక దృశ్యములను పరికించు దర్శ
కుని వంటివాడు. ఉత్తరకుమారుని బలహీనతలు ఈతని కొక్కనికే తెలి
యును. అభూతపూర్వమైన ఉత్తరుని విజయవార్త విని విరటుడు కుమా
రుని బిగ్గ కౌగలించుకొని గెల్పునుతించినాడు. కాని ఉత్తరునిలోని శుద్ధ
మనః ప్రవృత్తి ఆ ఎక్కుడు మాటను ఓర్వలేక కురుబలము జయించినది
నేనుగాదు "బృహన్నలా స్ఫురిత భుజాబలంబునను చూవె" అని నిజం
చెప్పినది. ఉత్తరుడు ఛద్మకార్యోపజీవి కాదనుటకిది తార్కాణము.
ఇంతేకాదు. బృహన్నలను అర్జుననిగా తెల్పుటకు అతని మనస్సు ఊరకేలు

చేసింది. కంటకుని సారథిగాని గాయపరచిన తండ్రిని సానునయముగా ఇట్లు మందలించినాడు. "తప్పుసేసితి రిట్టులు దగునె వీరశేమిగతిఁ బల్కను నది యెల్లజనము గైకొన వలయును" ఇదనీతిబోధ. బంధువుల యెడ స్నేహముతో పాటు ఉత్తరునిలో పెద్దలయెడ భక్తికూడ అగ్గలము. సహకోత్సాహిగా విఫలుడైన ఉత్తరుడు బాంధవ్య సూత్రములు కలుపుటలో గెలుపొందినాడు. విరటునింట ఉత్తరుడు క్రియాశీలుడు, సంధానకుశలుడు. తండ్రికి గారాబు పుత్రుడేగాక తండ్రిని దిద్దు నేర్పుగలవాడును పాండవులకు అమాత్యవర్గసహితమైన రాజ్యమీయ నెంచిన తండ్రి యాశయమును తన ప్రగల్భ వచనములతో నిట్లు స్థిరీకరించుచున్నాడు. "మనకీక రాజ్యముం గలదె నన్నును నిన్నును నిన్నమొన్న వీరనితరసాధ్య శత్రువిజయంబునఁ గాచిన యప్పుగల్గ" ఈ మహోన్నత వ్యక్తులకు మనమేమి చేసిననూ స్వల్పమే. ఇదిగాదు మనము చేయవలసినపని. ఉత్తరుని కోమలమైన మనస్సునకు తగిన ప్రతిపాదన యొకటున్నది. ఉత్తరుడు అర్జునునకు ఇవ్వతగిన క్రొత్త కానుక గనిపెట్టినాడు. అది ఉత్తర. ఆత్మీయులైన వారలను అతి సమీపమునకు గొంపోవు కాన్క ఇంతకంటె నెక్కడేమైయుండును ? ఇట్టి నిర్ణయములూ, వేడ్కలు, ఆవేశములు అతని లేత హృదయమునకు తగినవి.

ఉత్తరుడు గృహేతర జీవి కాదు, గృహజీవి. పెంపుడు పావురము వంటివాడు రచ్చ గెల్వలేకపోయినను ఇంటగెల్చెను. ఇల్లుదాటి తిరిగి ఇల్లు చేరువఱకు గల నడిమికాలములో క్రియాశూన్యుడు. బంధుప్రేమి, అర్భకుడు. అయినవారికి అల్లారుముద్దు, కానివారికి పిఱికి, స్నిగ్ధవచస్వి. చెల్లెలికి చెల్లెలివంటిఅన్న. తండ్రికి తండ్రిని మించన కొడుకు. బృహన్నలకు సారథి. వినయసంపన్నుడు. ఉత్తరుడు ఉత్తరత్వమునకు పర్యాయపదము.

## బృహన్నల

బృహన్నల మువ్వురకూ మూడు రూపములలో కనిపించినాడు. ఉత్తరునకు కనుపించిన రూపము ప్రచ్ఛన్న రూపము. కురుబలమునకు కనిపించినది సందిగ్ధరూపము. గోనివర్తనము తరువాత కనిపించినది అర్జున రూపము. బృహన్నలపాత్ర బృహన్నల గుణముల కనురూ

పన్నైనది కాకపోవుట ఒక చమత్కారము. ఉత్తరకుమారునిముందు అర్జు
నుడు సారథికి పనికిరాని బృహన్నల. ఉత్తరకు చనువైన నాట్యగురువు.
సైరంధ్రికి అతిరహస్యమైనసతి. "కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట
నెత్తివచ్చినను, జయింప నశక్యమైన తేజఃపటిమ గలవాడు" బృహన్నలను
ఉత్తర ముద్దుసేయు శిష్యురాలు. ఆమె కోరితే సారథ్యమొకటేమిటి?
పరమ దుష్కరకార్యముల నైతము నెరవేర్చగలడు. బృహన్నలకు ఉత్తరుడు
మేలంపు మాటలకు యాటబంతి. ఉత్తరుని ప్రగల్భములకు బృహన్నల
ఛద్మవినయములు మెఱుగు బెట్టినవి, 'సంగరము సేతకు సారథిగమ్ము రమ్ము
నీవనుటుచితంబె' అన్న ఆశక్తిప్రదర్శనము, అతనిమాటకడ్డమాడ వెఱచి
నట్లు' నటించు భయము, 'ఇట్టునట్టు నొఱవలుగా తనప్రాణము గప్పి
కొను' ఉపేక్షావైఖరి అతని బృహన్నలా వేషమునకుగాక అతని ప్రచ్ఛన్న
వేషమునకు తగియున్నవి. తాను విరటుని కొలువుసేయుచున్నాడు. కాబట్టి
వినయ ప్రదర్శన మావశ్యకమైయున్నది. అనగా ఇది అర్జునునిలో దాగి
యున్న సహజ క్షత్రియోచితమైన అవినయమును సూచించుచున్నది.
అడ్డమాడలేక వెఱచినట్లు నటించుచున్నాడు గాబట్టి కొఱవడు. అతని సహ
జసేవ్యభావ మిచ్చుట కృతకసేవక భావమును వహించినదనుట స్పష్టము.
కవచము తొడుగుకొనుటలోనున్న ఉపేక్ష నాట్యగురుగతమైన కళానిష్ఠను
సూచించుచున్నది కళోపాసకునకు ఆత్మవిహితకార్యములందున్న వేద్యాం
తరశూన్యత తద్భిన్నవిషయములందు ఉపేక్షగా తోచును. అదియునుగాక
బృహన్నల అప్పటి పరిస్థితినిబట్టి బహిర్విషయము లేవియూ తెలియనట్లు
గనే వ్యవహరించుట ఉచితము.

వీరసహజమైన సామాన్యగుణమును పరిహరించిన అర్జునునిలో కొత్త
వచ్చినట్లు కనపడుగుణము శిష్యవాత్సల్యము తొలుదొల్త సారథ్యము
వహించుమని అభ్యర్థించుటకు ఉత్తరవచ్చినపుడు ఒక్క సారథ్యమేమిటి
నీకొఱకు పరమ దుష్కరకార్యముల నైతము చేయుదునని చెప్పినాడు.
యుద్ధసన్నాహము చేయుతటి కురువీరుల శిరోంబరములను తెమ్మని చెప్పి
నప్పుడు జయలక్ష్మిని చేకొనుటకు వెళ్ళుచున్న మీయన్నకు శిరోంబర
ములు తెచ్చుట ఒకలెక్కలోనిదా యని మెచ్చు బల్కినాడు. ఉత్తరను
భార్యగా స్వీకరించుమని చెప్పినప్పుడు "నృత్తగీతాదులయెడ నిక్కమలికి
గురుండనైన నాకు నివ్విధంబు ధర్మంబుగాదు" అని నిరాకరించినాడు.

ఈతని గుహ్యభావము ఉత్తరయొద్దనే చెల్లును. ఇది బృహన్నలా వేషమున వృత్తికిఏగిన నృత్తవిద్యాధ్యాపన సమయమందలి ఆర్ద్రగుణము. ఈ బృహన్నలా వేషమువంటును పసిగట్టిచూచువారికి ఆతని అర్జునాత్మక గుణములు గోచరింపకపోలేదు. కురువీరులకు, అందునా, ప్రాజ్ఞులకు ఆతనిలోని మూర్తిసౌమ్యత, బాహులదీర్ఘత, భటత్వాతిశ్రేష్ఠత, గతిస్ఫురదుదాత్తతలు గోచరించినవి. వికృతవేషచ్ఛన్నదగుటవలన మూర్తిసౌమ్యత కనుగొనుటయించుక కష్టమే. పూర్వరూపము సాక్షికముగా కనిపించక తత్ప్రతిచ్ఛాయలు మాత్రమే కనిపించుచుండెగాబోలు. అందువలననే నివురుగప్పిన నిప్పువలె నున్నాడు. కాని బాహుల దీర్ఘత, గమన భంగియు దాచరాని విషయములు. ఈతని గమనము మదపుటేనుగు యొక్క విలాసమును బోలియుండును. శత్రువ్యూహముల నడుమ అర్జునుడు సింగమువంటివాడు.

ఉత్తర గోగ్రహణము నందలి యుద్ధము స్వీయ ప్రయోజనము కొఱకైనదిగాదు. స్వామి ధర్మనిర్వహణమే అందలి లక్ష్యము. ఒక్కొకప్పుడు యుద్ధము యుద్ధము కొఱకే చేయబడుచుండును. అప్పుడు యుద్ధధర్మములు కూడ విస్మరింపబడును. అర్జునుని యీయుద్ధమునకు లక్ష్యము గోనివర్తనము. ఆత్మశౌర్య ప్రదర్శనమే కాని శత్రుసంహారము కాదు. అందువలన ఎక్కువ హింసకు తావీయని సమ్మోహనాస్త్ర ప్రయోగము చేతనే విజయము సాధించినాడు. యుద్ధధర్మములు పాటించుట, యుద్ధపర్యవసానమును సుఖప్రద మొనరించుట, ఈ రెండును యుద్ధమును అకళంక మొనరించును. అర్జునుని యుద్ధము నీతి సమ్మతము. "కాలు తక్కువవారలు, గలయఁ జెదరి వెనుకఁబడి పోవువారు దన్నుఁగని భయమునఁ బ్రాణదానంబు వేఁడినఁ బార్థుండభయహస్తమిచ్చుచు దయ పెనుపారఁబలుకు" ఇట్లు దీనదశాదందహ్యమానులకు అభయమిచ్చినాడు గోవులను మరలించి తెచ్చుట ఫలసిద్ధి. ఈ ఫలసిద్ధితో గలుగు ఆనందోల్లాసము కెవరు ఆటపట్టులో అర్జునునకు తెలియును. కొమరుని విజయ సంపాదనమునకు ఎక్కువమురియునది తల్లి. ఉత్తరుని విజయప్రాప్తితో ఉత్తరుని తల్లిస్థితి ఏమైయుండునా? ఈ స్ఫురణ అర్జునుని కొక్కనికే యున్నది ఇట అర్జునుని ఆత్మీయతా స్ఫురణ గమనార్హము. ఉత్తర అడిగిన బొమ్మపొత్తికల విషయమున ఒక స్ఫురణ యున్నది ఇది ఇప్పుడు తల్లివిషయమునను కూడ చూచుచున్నాము. "హయములు మరల్పు, మీతల్లియు బంధులు నెడలు సంచలింప గుమురుగట్టి

రొమురు కూతురు" అని అర్జునుడు ఉత్తరున్ని తొందరపెట్టుచున్నాడు! మనుష్యుని బాహ్యకార్య సంపాదనము తుదకు గృహానందము కొఱకేగదా! ఇది తిక్కన శిల్పములోని కార్య పర్యవసానదృష్టి.

అర్జునుని పూర్తిస్వరూపము గోగ్రహణానంతరమే కనపట్టును. యుద్ధ సమయమున నాతడు సామాన్యుడు. అనగా మనకు సుపరిచితుడైన యోద్ధ. బృహన్నలావేషమునందును, తదుపరి గోనివర్తనము తరువాతనూ, అర్జునునిలో వేషాంతరమునకు సంబంధించిన మార్పులేగాని మానసికములైన మార్పు లేమియులేవు. శరీరవికారము మార్పులో మనస్సు మార్పుచెందనవసరము లేదు. కాని ఆగంతుక వేషమువలన ఆచరణలో కొన్ని మార్పులు వచ్చెననుట నిజము. తాను అర్జునుడగుట విరటునకు తెలియపర్చవలదని ఉత్తరునికి చెప్పినాడు. ఆత్మసంకోచమువలన కాదు. సమయమెఱిగి తనను తెలియపర్చ మనుటయే. ఇది అర్జునునికిగల సమయస్ఫూర్తి. పైన ఉత్తరవిషయములో ఆత్మీయతా స్ఫూర్తి కనుగొంటిమి. ఇక్కడ సమయస్ఫూర్తికూడ చూచుచున్నాము. ఇంతియేగాదు. తనకు చూపక ధర్మజుడేల మోముదాచుకొనుచున్నాడో తెలియక సైరంధ్రినతడు గ్రుచ్చి గ్రుచ్చి యడుగును. ధర్మజుని సమాధానము వచ్చువఱకు నాతని మనస్సు కుదుటబడలేదు. తనమీద బరువులకయిష్టత కలుగకుండ చూచుకొను ఆత్మవిచక్షణా జ్ఞానముకూడ అర్జునునకున్నది. ఇట్లితడు ప్రతికార్యమందునూ అతిజాగరూకుడై మెలగుచున్నాడు. అజ్ఞాతవాసమునకీ జాగరూకత ఎంతయు తగియున్నది. తనను తన ఆప్తులను ఏమఱక అటు ప్రభువును ఇటు అగ్రజానుజులను సేవించినాడు. అన్నను సారెగొని కీడ్పరచినందుకు విరటునిమీద భగ్గున మండినాడు.

గృహాలాలస తిక్కనపాత్రల విశేషము. అర్జునుని సాధికారరూపము యుద్ధసమయమందు ప్రస్ఫుటమగుచున్నది. కాని బృహన్నలారూపమూ, వివృత బృహన్నలారూపము. తిక్కన రచనా వైదుష్యమునకు అనుగుణములైనవి. నాట్యగురువుగా బృహన్నల భావుకుడు. సరస సంలాపవినోది. విరటునిముందు అర్జునుడు నపుంసకునికంటె మించియుండలేదు. కాని అతని కార్యము దేవసన్నిభమైనది. కాని అతని మనస్సునుకూడ జయించి ఆతని పుత్రికి భర్త కాదగినంతటి పురుషుడైనాడు. బృహన్నలారూపములో ఉత్తరునిముందు ఆత్మరక్షణదశలోనున్న అర్జునుడు ఉత్తరుడశక్తుడైన సమయమునుండి ఆధికారిక (ఆక్రమణ) దశలోనికి మాఱినాడు. 'ఉత్తరుని కాసిం

చినాడు. ఊరడించినాడు ధైర్యము చెప్పినాడు. కాని విరటునియందు జంకినాడు. ఈ జంకు మొదటిజంకువంటిదిగాదు. మొదటిది ఉత్తరుని కవ్వించుమనది. రెండవదానిలో ఆత్మప్రశంసను సహించని అడకువయున్నది అర్జునుని విజయోల్లాసముకూడ ఇట్టిదే. ఈ విజయోల్లాసము ఆత్మశ్లాఘనము వంటిదిగాక ఆత్మసంకోచమువంటిది. ఇచ్చట అర్జునుడు రాజసగుణుడు కాడు. సాత్త్వికుడు. ఆయుధక్రీడ నెరపియు నిరాయుధవ్రతి. శక్తి యుండియు అశక్తునివలె మెలగిన ధీరుడు. వచ్చినకోపము వచ్చినట్లు దిగ మ్రింగుకొని అగ్రజుననుకరించిన అనుజన్ముడు. శిష్యను భార్యగాగాక వధువుగా స్వీకరించిన నిర్గంధుడు. ఈతనికి విజయముకూడ వినయము. నాట్యాభ్యాసమున కనువైన ఈతని బాహుచాలనము ఖరబాణోక్షేపసమర్థము. ఈతని రౌద్రములో సాత్త్వికతయున్నది. ఈతని ఉల్లాసములో అడకువయున్నది. ఇతడు ధీరోదాత్తుడు. ఈ పాత్ర ఉత్తరగోగ్రహణమునకు నాయకపాత్ర. అధికారికముగా నాయకుడు ఉత్తరుడు. కావ్యగురుత్వదృష్టితో చూచిన అర్జునుడు నాయకుడు ఒక విచిత్ర పరిస్థితిలోనుండి అర్జునునిపాత్ర వెల్లుబుకినది. అర్జునునకు ఉత్తరగోగ్రహణము అగ్నిపరీక్ష. అతని స్థైర్యమునకు, అతని శౌర్యమునకు, అతని స్వామిభక్తికి, అతని భ్రాతృధర్మ నిర్వహణమునకు అతని ఇంద్రియనిగ్రహమునకును ఉత్తరగోగ్రహణము అగ్నిపరీక్షవంటిది. అర్జునుడిందు పరిశుద్ధుడు, ఉదాత్తుడు. జాగరూకుడు. సంయమి. ఈ కావ్యమందితడు రథికుడయ్యును సారథియే.

## విరాటుడు

విరటుడు పుత్రగతప్రాణి. తాను యుద్ధమునుండి తిరిగి వచ్చిన తరువాత వేసిన మొదటిప్రశ్న ఉత్తరుడెచ్చట నున్నాడని. ఊరిప్రయాణము నుండి తిరిగి వచ్చిన తరువాత తండ్రులు వేయు మొదటిప్రశ్నయు నిదియే. విరాటుడిచ్చట రాజుకంటె నెక్కువ ఇంటిపెద్ద. ఈప్రశ్నలో విరాటుని రాజ్యవ్యవహారదృష్టి కంటె ఎక్కువ ఈయన గృహమమకారమైయున్నది. ఒంటరిగా కురుసైన్యమును జయించుటకు ఉత్తరుడేగినన్న వార్త అతనికి పిడుగు పాటైనది. అతడొక్కక్షణము దుస్తరవేదనా దోదూయమాన మానసుడైనాడు. చాలినంతసైన్యములనిచ్చి సహాయార్థము బంపుమని వెనువెంటనే యుత్తరువులిచ్చినాడు. తిరిగి ఉత్తరుని విజయవార్త వినునంత వఱకు నాతని

మనస్సు ఊరట చెందలేదు. విరాటుడు ఉద్వేగమనస్కుడు ఆనందము విషాదము రెండునూ భరించలేదు. యుద్ధమునకు కొడుకు ఒంటరిగా వెళ్ళి ననుటతో ఆకాశ పాతాళము లేక మొనరించిన విరాటుడు తిరిగి ఉత్తరుని విజయవార్తకు హర్షబాష్ప సంప్లుతమైన మోముతో పొంగిపోయినాడు. నగరినలంకరింపుడని, ఉత్సవములుచేయ చాటింపుడని తొందరపెట్టినాడు. హర్షము, శోకము, కోపము, భక్తి ఆదిగాగల మనోవికారములకు నాతడు పూర్తిగా లొంగిపోయినాడు. కొడుకును పొగడక పేడివానిని పొగడు చున్నందుకు వెనుక ముందరయక పారెచేబూని ధర్మజుని గంటుబడవేసి నాడు. పెద్దవారి నిట్లుచేయుట తగునాయని ఉత్తరుడు మందలించగా భయభక్తిసహితముగా క్షమించుమని ధర్మజుని వేడికొనినాడు. ఎవరో యొకరు దేవాంశ సంజనితుడు నాకు యుద్ధమున సాయపడెనని చెప్పగా అమ్మహాత్ముని గనుగొన, కౌగిలింప, వినయపూర్వకముగా అర్ఘ్యపాద్య విధులతో అర్చించ తహతహలాడినాడు. కొల్వులోనున్నవారు పంచపాండ వులని తెలియునప్పటి విరాటుని సంతోషమునకు మేరయేలేదు.

విరాటుడు వయస్సుమళ్ళినవాడైనప్పటికిని భావోద్వేగి. ఈతని ఎదిరిపాత్రయైన యుధిష్ఠిరుడు ఉదాత్తుడు. తిక్కన, ఉత్తరుని నిర్మాణ మునకు భిన్నముగా బృహన్నలను నిలబెట్టినట్లు విరాటునకు భిన్నముగా ధర్మజుని నిలబెట్టినాడు. ధర్మజుడు అనుద్వేగి. శాంతమూర్తి. సారెప్రేటుకు గాయపడినవాడు ధర్మజుడు. సారె విసరినవాడు విరాటుడు. అతడు క్షమాప్రాప్తి. విరాటుడు క్షత్రియుడు. ధర్మజుడు బ్రాహ్మణరూపమున నున్న క్షత్రియుడు. గుణతః బ్రాహ్మణుడు. ఇద్దరూ తిరిగి చివరకు క్షత్రి యులూ, బంధువులు. ఉత్తరగోగ్రహణమును బాంధవ్యాంతముగాచేయు తిక్కన సంకల్పము. ఈ బాంధవ్యములలో చివరకు ఆత్మైక్యమును సాధిం చుటకు వీరిపాత్రల పూర్వభాగములలో వైమనస్యభావ సమ్మేళనముజరిగినది. ఉత్తరునకు బృహన్నల, విరాటునకు ధర్మజుడు పూరకపాత్రలు. అనగా మత్స్యనగరస్థులు రజోగుణోపేతులు. హస్తినాపురీయులు సాత్వికులు. ఉత్తరునివలె విరాటుడుకూడ గృహజీవి. కాని వయస్సులలోనున్న భేదము తండ్రి కొడుకుల మధ్యనున్న భేదము. పెద్దలయెడ విశేషించి తనకు సన్నిహితులైన పాండవులయెడ వీరికున్న గౌరవము, అసమానము. సాహస ములో కొంచెము తేడాయున్నది. తనకయిష్టముగా తోచిన సారెగొని

ఇతరుల గాయపరచుటకు సైతము విరటుడు జంకడు. ధృతరాష్ట్రునివలె విరాటుడుకూడ పుత్రప్రేమి. ఇది గుడ్డిప్రేమ. తనయుని శక్తిసామర్థ్యములను తెలుసుకొను వివేచన అతనిలో లేదు. అభూతపూర్వమైన ఉత్తరుని విజయవార్త విని ఆశ్చర్యచకితుడైన విరాటుడు ధర్మజునిమాటకు చెవియొగ్గి నిజానిజములు తెలుసుకొనవలసియుండగా పేడిగడన మానుమని సారెగొని చేయుట అతని వివేకరాహిత్యమును సూచించుచున్నది. కాని పెద్దలన్న తలయొగ్గుట చూచిన అతని కార్యాకార్యములు పనిపెట్టుకొని చేసినవి కానందువలన దుష్టబుద్ధి ప్రేరితములు కావని బోధపడును. పాండవులన్న యాతనికత్యాదరము. అమాత్య భృత్య పరివార సహితముగా వీరిని కొలుతువని సమాధానపడినాడు.

—దుర్గానంద్.

# శ్రీ మదాంధ్ర మహాభారతము

## (ఉత్తరగోగ్రహణము)

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 1

క. సూర్యోదయావసరమున,
దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా,
చార్యరవిసుతాదియోధ సంఘోద్భటమై. 2

వ. ఇట్లు నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటు పశుగణంబులం బొదివె నట్టియెడ ముక్కడిమూకలు సని యెక్కడెక్కడయని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖ ప్రముఖరథికజనంబులు గోపాలవర్గంబు ననర్గళప్రసారం బగుశరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబునకరుగుదెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్న భూమింజయుంగాంచి ససంభ్రమంబుగా నిట్లనియె. 3

మ. ధరణీచక్రము సంచలింపఁగ సముద్భ్రాంతంబులై గ్రక్కునం
గురుసైన్యంబులువచ్చి ముట్టికొనియెన్ గోవర్గమున్ వేగమై

మరలం దెచ్చుటకుం గడంగుము రిపుక్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు
శోభిల్లఁగన్. 4

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతను,
త్రాణ ముగ్ర చాపబాణపూర్ణ
తూణఘనగదాసితోమరచక్రాదు.
లనువుగా నొనర్పు మతిరయమున. 5

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బదివేవురనుండటఁ జెప్పు బాహువి
స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్. 6

క. అని కాంతాజనములలోఁ,
దను నగ్గించుటయుఁ బొంగి దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దనమన,
మున సంగరకౌతుకంబు ముడివడు చుండన్. 7

భూమింజయుండు గోవుల విడిపింప గౌరవులతోఁ బోరుటకుఁ బో నెన్నుట.

ఉ. ఎత్తినఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొని రేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ సెందెడు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గడాకడప నెంతయు నేర్తు రథం బనం బురిన్. 8

క. తగుసారథి దొరకొనినం,
బగతుర భంజించు టెంతపని కదుపుల ద
వ్వఁగఁ గొని పోదురొకో యి,
ట్లగునె కలండేని సూతు నరయుం డెందున్. 9

చ. కురుపతిభీష్మకర్ణకృప కుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం
గరముననోర్చి యేఁబసులఁ గ్రమ్మఱఁ దేరకయున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు
మెత్తురే. 10

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 11

క. విని ద్రుపదధరణిపతినం,
దన సామర్థ్యాపహాసతరళహృదయ యై
చని తద్వృత్తాంతము మె,
త్తనిపలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. 12

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి
పాంచాలి కిట్లనియె నీవు వోయి వారలతో ని ట్లనుము
మన బృహన్నలకు సారథ్యంబు సేయు సామర్థ్యంబు
గలదు దొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యము
నకు సారథియై యతనిచిత్తంబు వడసె మఱియుఁ బెక్కె
డలం దదీయంబగు రథంబు గడపఁ దానయై యుండు
నేను నెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యం
బుల జయింపవచ్చుటకు సంశయంబు వలవ దనుము వా
రేమని రేని మఱియుం దగనాడి నన్నుం బిలిపించునట్టి

తెఱంగు గావింపు మన నట్లు చేయుకు నని సైరంధ్రి
యుత్తర యున్న యెడకుం బోయి. 13

చ. జనపతినందనుండు దగు సారథి నారయు చున్నవాఁ డెఱిం
గినపని సెప్పఁగా వలయుఁ గ్రీడి మనంబున మెచ్చునట్టినే
ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కినసూతవృత్తిమై
నని నడి నన్న యేడ్తెఱ బృహన్నలకుం గలదంబుజాననా. 14

తే. అర్జునునకు ఖాండవదహనాదు లైన,
విక్రమము లాబృహన్నల వెరవులావు
గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత ముత్తరునకు. 15

క. అని యమ్ముదితయుఁ దానును,
జని యతనికి నత్తెఱంగు సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి,
ట్లనియెం బాంచాలితోడ నల్లన నగుచున్. 16

తే. అకట సైరంధ్రి నన్ను ని ట్లాలిగొనఁగ,
నేల చక్కఁగఁ గను విచ్చి యేను బేడిఁ
జూడ రోయుదు రణమున సూతకృత్య,
భరము దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ. 17

వ. అదియునుం గాక. 18

చ. కురుబల మేఁగుదెంచె నని గోవుల బి ట్టఱఁబట్ట దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁ [illegible]
నరిగెద నట్టె తేరికి బృహన్నల సారథి యైన దీని [illegible]
వ్వారె పురిలోన నింతకఱవా రథచోదకు లింత [illegible] 19

వ. అనిన విని సైరంధ్రి యతని కి ట్లనియె. 20

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వ వచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన మున్నె యుంగుదుం
గారణజన్మ మై తనువికారమువచ్చినఁ బెంపు దప్పునే. 21

వ. అనవుడు. 22

క. మన మురియాడుచు నుండఁగఁ,
దన కొరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం,
బనుచుట కోడఁబడినపలుకు వలుకుటయుఁ దగన్. 23

వ. సైరంధ్రిదెసఁ గనుంగొని యేను బోయి తోడ్కొని
వచ్చెద నని పూని. 24

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మరా
గంబుల నెలకట్టుకరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు
నసదుఁగౌఁదీఁగె యల్లాడు చుండఁ
దఱివేచి నెను వెంటఁదగులు కామాంధ కా
రముల్లీలఁ గ్రొవ్వెదగొమరు మిగులఁ,
గర్ణభూషణమహా క్తికప్రభాడోలన
మీాక్షణదీప్తుల నినుమడింప

తే. నందియల మొరపంబున కరుగుదెంచి,
ప్రోది రాయంచ రయమునఁ బోవునవ్వి
ధంబు దగ నభ్యసించుచందమునఁ దోన,
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 25

ఆ. మెఱుఁగు మొగిలుసొచ్చు తెఱఁగున నాట్యమం,
దిరముసొచ్చి తనదు గురువుకడకు
నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా,
వినయసంభ్రమములు పెనఁగొనంగ. 26

క. ఇచ్చట నొకకయ్యంబునఁ,
జెచ్చె మదీయాగ్రజన్మసారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం,
డచ్చపుటుపఁ డయ్యె నీకిరీటికి నొండొకనిన్. 27

వ. అది యట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన నన్న సన్నద్ధుం డై వెనుకం దగుల సమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తెర నన్నుఁ బనిచిన నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటం జేసి యెల్లవిధంబులం దెత్తు నని పూనివచ్చితి నీవును నాపలుకులు గుఱిచసేయక నీ పెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తర కుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలుగవలయు నిట్లొడంబడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంత పఱుచుట యనిన నమ్ముద్దియపలుకులు ముద్దుసేసి. 28

క. నగుచు బృహన్నల యి ట్లను,
జగతీశ్వరపుత్రి నాకు సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే,
మిగులంగా వెఱతుఁ బోదము మీఁ ఁ ట్లుండెన్. 29

క. భవదీక్షుఁ ప్రార్థనచేఁ
దివిరి పరమదుష్కరములు దీర్చ యయిన ను
త్సవ మొనరించెద సార,
థ్యవిధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా. 30

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్త
మెత్తన నడతెంచు మత్తశుండాలంబునుంబోలె. 31

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిఁగాఁ జేసికొనుట

తే. అరుగుదెంచుబృహన్నల నంత నంతఁ,
గని నృపాలసుతుం డను గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబుగలిగె నాకుఁ,
గడఁగి నేఁడు రథ మీవు గడపవలయు. 32

క. వే రమ్ము మైమఱువుఁ దోడి,
తే రెక్కము దప్పఁ గ్రుంకఁ దీఱదు' నీకున్
సైరంధ్రి సెప్పె నీ దగు,
బీరమ్మును బెంపు లావు వెరవును మాకున్. 33

చ. అనుటయు నాటపాట గలయప్పటికిన్ ననుఁగోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరము సేఁతకు సారథి గమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁ డైనయో
ధ్ధనిరథ మే త్తెఱం గడపఁగా నియమింపుమురాజనందనా 34

వ. అనిన విని వైరాటి గిరీటి కిట్లనియె. 35

ఉ. ఖాండవ మేర్చునప్పుడు దగన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము గల్గ నొనర్చినయట్టి బుద్ధియున్
దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట దక్కుము రణోత్సహనం బొనరింపు
గ్రక్కునన్. 36

తే. అనిన నాతనిమాటకు నడ్డ మాడ,
వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల
నియ్యకొనుటయు నమ్మనుజేంద్రసుతుఁడు,
దృఢతనుత్రాణ మతనికిఁ దేరఁబనిచె. 37

క. తెప్పించి తొడుగు మీ వని,
యొప్పించిన నిట్టు నట్టు నొఱవలుగా మైఁ
గప్పికొని యా బృహన్నల,
యప్పుడు నగుపించె నచటి యబలాజనమున్. 38

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ,
దత్తనువున మఱువు దొడిగి తానును హృద్యో
దాత్తం బగుకంకట మిడి,
చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 39

వ. బృహన్నల నవలోకించి. 40

క. హయములఁ బూన్పుము రథమున,
రయమున సిడమెత్తు మిప్పుడ శాఖలయును గో
చయముఁ గొని యస్మదీయవి,
జయము నభినందింపఁ బురముజను లెదురుకొనన్. 41

తే. అనిన నీ వేమి పనిచిన నట్ల చేయ,
వలయు నీ వున్న యెడ నుండవలయు నీవు
సన్న దెసఁ జనవలయు నా శక్తి యెఱిఁగి,
పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలుము. 42

వ. అని పలుకుచు మనంబున ముదంబొదవ నా ధనంజయుండు. 43

క. కాంచనమాలాలంకృత,
చంచత్తనులీల మెఱయ జవనాశ్వములం
బూన్చి రథంబున మణిమయ,
పంచానన కేతు వెత్తె బంధురభంగిన్. 44

వ. ఇట్లు సన్నాహంబు మెఱసిన సారథిం జూచి యుత్తరయుం
జెలులు నిట్లనిరి. 45

క. కురువీరుల గెలిచి తదం,
బరములలోఁ జిత్రవర్ణ భాసురములు గాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ,
కరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ. 46

క. అనుడు బృహన్నల యిట్లను,
జనపాలకనందనుండు జయలక్ష్మిం జే
కొను నపు డె చీరలు దెచ్చెద,
పనిఁబూని యటు సూడుఁ డెల్లభంగులఁ దెత్తున్. 47

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాది వివిధసాధనంబులు
రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల
స్రుక్కు సక్కంజేయ నుత్తరుండును బసులంబట్టిన దెస
గోపాలకు నడిగిన వాఁడు పితృవనంబువల నని చెప్పిన

వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపుణ్యాం
గనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి
ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయిన
మాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమిం
జయమున కయ్యోగ్యు మని దీవించి సేసలు సల్లం బురంబు
నిర్గమించి నిరర్గళపరాక్రముం డయిన యా ఫల్గునునైపు
ణంబున వల్గదశ్వం బగురథంబు రయంబునకు మెచ్చు
చుంబరేతనిలయప్రాంత ప్రదేశంబు సేరం జని. 48

సీ. అభినవ జలధర శ్యామంబులగు నెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగునట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరము లగుచోటులు
దఱచుఁ బూఁబొదలచందంబు నొంద
హరిద్రరుచి సమానాకృతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ
తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిఁ గాఁపువోయెడు తెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల గోడిపడఁగ
నడుచు కౌరవరాజసైన్యంబుఁ గనియె. 49

ఉత్తరుఁడు గురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట.

క. కని యుత్తరుండు గరుపా,
ఱిల మేనును దఱఁకుమనము ఱిచ్చపడిన చూ

పును నై తొట్రుపడుచు ని,
ట్లనియె దిగులు సొచ్చి యా బృహన్నల తోడన్. 50

శా. భీష్మద్రోణ కృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే. 51

క. అకృతాస్త్రక్రీడ బాలుఁడఁ గా,
మ్మక విద్యాప్రౌఢిసైని రూఢు లయిన యా
శకుని జయద్రథ దుర్ముఖ,
వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే. 52

క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి,
మెట్టొకో మనభంగి వీర లిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను,
నట్టి కొలఁది గాదు భీతి యడరెడుఁ దోడ్తోన్. 53

ఉ. కౌరవసేనఁజూచి వడఁకందొడఁగెన్ మదిలోన మేను నీ
వూరక పోవు చున్కి యిది యొప్పు నె యిప్పటిభంగిఁజూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరుమరల్పు ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా. 54

వ. అనిన దరహాసితవదనుం డగుచు శతమఖ తనయుం
డతని కి ట్లనియె. 55

చ. అసదృశలీలఁ బొల్చురథికావలిమీఁద జనంగ వెక్కినే
మసలక యామిషంబు గొని మార్గము వట్టినతుచ్ఛ
సైన్యమున్

వెసఁజని ముట్టి గోధనము వేగ మర ల్తుముగాక యి మ్మెయిం
బసు లటువోవఁగా మరలఁబాడియె నీకు న రేంద్రనందనా. 56

ఉ. అంతిపురంబులోనఁ గలయంగన లెల్లను నెమ్మనంబులన్
సంతసమందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెదనంచుఁ బూని నీ
వెంతయు మేటిపై యరద మెక్కి రయంబునవచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భట కదంబముఁజూచి కలంగు టొప్పునే. 57

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని
యెలుఁగు వడఁక నాతఁ డిట్టు లనియెఁ
బసుల దయ్యె మెఱుఁగుఁ బడఁతుల సంతోష,
మేల నాకు ననికిఁ జాల నేను. 58

వ. అనవుడు. 59

చ. తన భుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁజూచి చూచి యె
ట్టును దెగకున్నఁ బోక యిది,లోకము చక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రీబలము నీదెసఁ దేఱియుఁజూడ దింతకున్
మును భయహేతువైన విధముం దగఁ జెప్పము నాకు
నిత్తతిన్. 60

సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురు చిందంబుల
కోలాహలములకుఁ గుదియఁబడక
యురవడి సేనలు దెరలఁ బైఁ దోఁతెంచు
ధూళి పెల్లడరినఁ దూల పోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్గాంగ
తతి నాఁటుతరచునఁ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర బరవసమున,
నిత్తెరంగునఁ గలుగుక్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక,
దవ్వుదవ్వుల నిల్లిన నవ్వ రెట్లు. 61

చ. అనుదివిజేంద్రనందనున కమ్మనుజేంద్రతనూజుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యుదగ్రతసైన్యము లెన్ని యన్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి బాసట లేర
యెవ్వరున్. 62

తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ,
నే యిదేటికి వెడమాట లిట్టు లాడ
వాదు గానక ముందఱ తేరు దోలు,
కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి. 63

వ. అనినం బార్థుండు పార్థివనందనున కి ట్లనియె. 64

క. వెగ డొంది యిట్లు వలుకఁగ,
నగునే పగతురు ప్రమోద మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు,
దెగడంగా మగిడి పోక దీనత గాదే. 65

వ. అట్లుం గాక. 66

మ. నను సైరంధ్రిగడంగి పేర్కొనియె దానంబెంపుమైఁబిల్చి తో
డని తోడ్తెచ్చితి పేవు బంటుతన మట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చెం దుదిఁబోయి కౌరవులు గోవర్గంబుఁగొంపోవఁగాఁ
గని యేఁగ్రమ్మఱిరిత్తవోదు నెభయోత్కంపంబు నీకేటికిన్. 67

తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁ బట్టు,
మిపుడు కౌరవసైనికు లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమునులావు వెరవు మెఱయఁ,
గదుపుఁ బెట్టించిపోదము గ్రమ్మఱంగ. 68

వ. అనుచు విహ్వలుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు
నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్ల
భుకుమారుండు. 69

క. దవ్వుల విఱిగినఁ జౌరులు,
నవ్వుదు రకట మేలు మేలు నను నాఁగకు నీ
క్రొవ్వుఱుగ దేనిఁ దలపడు,
మెవ్విధిఁ జని తేని యనుచు నెత్తినభీతిన్. 70

క. శరములు శరాసనము న,
య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం,
బురిదెసకును లజ్జ వీటిఁ బోవం బాఱెన్. 71

వ. ఇట్లు వాఱినం దనమానసంబునం గుత్సించుచు బీభత్సుండు
యుగ్యంబులపగ్గంబుల నొగల ముడిచి రథంబు డిగ్గ
నుఱికి లంబకేశభారుండును నాందోళిత రక్తాంబర
యుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచుసమ
యంబున నిలిచి కనుంగొనుకౌరవబలంబునందు. 72

ఉ. అక్షులఁ గొంద ఱప్పు డపహాసము సేయుచు గూఢరూపశే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృతకాయమునిూఁదను దృష్టి నిల్పఁగాఁ

బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహులదీర్ఘతయుంభటత్వత
త్త్వక్షతయున్ గతిస్ఫురదుదాత్తతయుం గని
సంశయంబుతోన్. 73

తే. ఆఁడు చందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నది యొప్పు నూష్మలతసొంపు
వికృతవేషాకృతంబులై వెలయ కితఁడు
నివుఱు గవిసిన మెఱయనినిప్పువోలె. 74

ఉ. బాహులచాయయున్ గమనభంగియు నర్జునునట్లు దీన సం
దేహము లే దితండు దన తేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ గీడ్పడి యుండెనొ కాక యీకురు
వ్యూహముతోడికయ్యమున కొండొకరుం డిటు లొంటి
వచ్చునే. 75

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొనిపోయిన నొండులు లేమిఁ జేసి యు
త్తరుఁ డిట వచ్చుచుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు
సూడఁగన్. 76

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ
డేమియున్. 77

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగుచుండ శుండాల రయఃలీలాసమ రేఖంబగుగమనంబునం బురుహూత పుత్రుండు పదశతమాత్ర ప్రదేశపలాయితుండైన భూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 78

సీ. వెలవెలఁ బాఱుచు వెగ డొందుఁ బెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్పఁ
బదములుఁ గరములుఁ గుదియ వడఁకు
హృదయంబు దటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముఁ దేఱి చూచు
నెలుఁగు డగ్గదికఁ దొట్రిల నేడ్చి విడు మని
ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప
తే. నిష్కశతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాప్తవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొక్కయూరుఁ బుర్యము సొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు 79

క. నాతోడ్కి ఫేమ్ముడిం గడు,
నాతురతయై యెదురుచూచుచునంబకుఁ జేతః
ప్రీతిగఁ జని ధ్యాయముఁ బ్రొడ,
సూతుం బో నీఁగదే విశుద్ధ చరిత్రా. 80

అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిగాఁ జేసికొనుట.

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించుచుండఁ బార్థుండు నగుచు నతనిం దేఱ నేరం దెచ్చి.

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱఁగది యేల నీ కుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁ జి
చ్చఱపిడు గట్టు లట్టడరి శూరుల మొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 82

క. అనుచు నొడఁబాటు లేకు,
న్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి,
చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. 83

వ. ఇట్లు సవ్యసాచి నిక్షిప్తాయుధం బైన శమీవృక్ష సమీ
పంబున కరుగు నవసరంబునం గ్లీబరూపచ్ఛన్నుం
డయ్యును బ్రస్ఫురణ విశేషభీషణుం డగు నతనిం గనుం
గొని కౌరవసైనికులు గలంగినమనంబులతోడ నివ్వెఱ
పడి యుండ వారలం గనుంగొని తోఁచునుత్పాతంబుల
నాలోకించి గురుం డిట్లనియె. 84

క. మాసె నభోమణి నక్కలు,
గూసెం గలయంగ దెసలకుం బలుసాయల్
సేసెం బఱమొయిళు లడరి,
మ్రోసెం దమయంతఁ దూర్యము లపధ్వనులై. 85

క. ఇగ్గజములు మిన్నకయును,
మ్రొగ్గెడు నుత్తమతురంగములు బాష్పజలం
బగ్గలము విడుచు చున్నవి,
దగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడఁగల్. 86

క. దగ్ధము లైనట్టులు స,
మ్యగ్గర్భ్యము లెడలె మండె నాయుధచయముల్
దిగ్భాగం బెసఁగె నసం,
దిగ్ధము మన కాజి యగుట దీనికిఁ దగఁగన్. 87

క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు,
దనతనవాహనము లాయుధము లెల్ల జనం
బును ననువుసేసికొనుఁ డో,
పినయంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్. 88

వ. అని చెప్పి తా నప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాససమయభంగం బగునో యనుభయం బున సురనదీసూనువదనంబు వీక్షించి సన్నవాఱ ని ట్లనియె. 89

చ. వెరవరి గాక వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొక మ్రానిపేర నిట సేరఁగ వచ్చుచునున్న వాఁ డహం
కరణమ కాని యొండొకటి గాఁడు మూర్తివిశేష మారయన్
సురపతియట్ల వీనిమది చొప్పది యెట్లొ యెఱుంగ
నయ్యెడున్. 90

క. అనిన విని యెఱిఁగికొని యా,
తనిమది సందియము మాన్పఁ దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతనితోఁ జె,
ప్పినభంగి నిగూఢవృత్తి భీష్ముఁడు వలికెన్. 91

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు,
కొలఁది గడచి వచ్చితిమి యకుంఠితబాహా

బలము నెఱపఁ దఱి యయ్యెను,
జలింప నల దింక మనకు శత్రులపలనన్. 92

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు గనికొని పార్థునకు సమయభంగంబువలని సంకటంబు లేకునికి మనంబునం బ్రియం బంది మొగంబునం దోఁప నీకపుయిలోట దక్కి యి ట్లనియె. 93

శా. సింగం బాఁకటిచేఁ గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్త్రత్నపై నేఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 94

ఉ. ఈతఁ డొకం డొకయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి నో
వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా విన మె పెంపెస లారెడుబాహుసంపదన్ 95

వ. అనుపలుకు లాకర్ణించి కర్ణుండు గటకటంబడి కుంభసం భవున కి ట్లనియె. 96

ఉ. పాండవపక్షపాతమునఁ బల్కెదు నోరికి వచ్చినట్లు ని
న్నొం డన రామిఁ జేసి యిది యొప్పనె కౌరవసేన కెల్ల నో
క్కండవ మేటి వీబలము గర్వముఁ గుండఁగ నిట్లు శత్రుదో
శ్చండిమ కోహటించితి నిజంబునకున్ నరుఁ డింతయెక్కుడే. 97

ఆ. అతఁడు వచ్చెనేని నస్మచ్ఛిలీముఖ,
పాతచలితహృదయపద్ముఁ జేసి

నెగడుపఱిచి యోధవీరుల కెల్ల ను,
త్సవ మొనర్తు బాహుదర్ప మొప్ప. 98

వ. అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె. 99

ఆ. తప్పఁ బలికి తీవు సెప్పెద విను మితఁ,
డర్జునుండ యేని నడవి కేఁగి
భ్రాతృయుతము గాఁగఁ బండ్రెండువత్సర,
ములును నంద నిలువవలయు మగుడ, 100

క. ఒకఁ డయ్యె నేని మామక,
శరాసనత్క్షిప్తదీప్తసాయకపంక్తిం
బరిమార్చెద వ్రేల్మిడి న,
చ్చెరువుఁ బ్రమోదంబు నొంది సేవలు వొగడన్. 101

క. అను పలుకులకును భీష్ముం,
డును ద్రోణుఁడు ద్రోణసూనుఁడును గృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయా,
ననుతాపములైన తెలువు లాస్యముఁబొందన్. 102

అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైన గాండీవంబు గొనుట.

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం
బంచి పార్థుం డుత్తరున కిట్లనియె. 103

క. ఇన్నగమునందు గాండివ,
మున్నది యది గాని మద్భుజోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు,
నన్నువ లీవిండ్లు గుఱుచ లలఁతిబలంబుల్. 104

క. ఇవి నీ తెగఁ గొలఁదివి వీ,
రవినోదము నప్పు డధికరంభసము లగును
ద్వివిధాటోపములకుఁ జా,
లవు విల్లది నూఱు వేలలా వరయంగన్. 105

క. వీనిఁ గొని గట్టి మైమఱ,
వేనుంగును మఱియు నెట్టి వేనియుఁ దునియం
గా నేసు నగునె కైదువు,
లేనియు లవుకలిమి పోర లెస్సైన యున్నే. 106

వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము ధర్మజ భీమార్జుననకులసహదేవులు దమతమ సమస్తాయుధంబులుఁ గూడంగట్టి యిందుఁ బెట్టినవా రాకట్టు విడిచి యందు గాండీవంబు పుచ్చి కొని తక్కటియవి యెప్పటియట్ల బంధింపు మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్రసంచయంబు సూపిన భూమింజయుం డతని కి ట్లనియె. 107

క. వీనుఁడు నంటఁగ నగునే,
భూనాథతనూజుఁ డనక పుయి లోడక న
న్నీ నీచపుఁబనిఁ బనుపం,
గా నీకుం దగునె పాపకర్మము గాదె. 103

వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున. 109

ఆ. మనుజు లంట కుండ మఱువడఁ జేసిన,
యస్త్రశస్త్రసంచయంబు గాని

శవము గాదు మత్స్యజనపాలతనయ యే,
నట్టి దైనఁ బనుతు నయ్య నిన్ను. 110

క. నమ్ముము కైదువువో పగు,
జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా కం
ది మ్మనుడుఁ జేయునది లే,
కమ్మ్రఘుం డమ్మహీజ మలసత నెక్కెన్. 111

వ. ఇట్లుత్తరుండు సమారూఢశమీవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయబంధం బెడలించిన. 112

క. మెఱసి యుదయించు గ్రహముల,
తఱచు ప్రభలఁ గ్రేణిసేసి దశదిశలం గ్రి
క్కిఱిసి వెడలె నావిండ్లన్,
మెఱుఁగులు నృపతనయుదృష్టి మిఱుమిట్లుగొనన్. 113

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 114

క. పెనుఁబాములచందంబున,
నునికికి భయ మంది వడఁకు నుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ,
తనయుఁడు వెఱ వాపుటయు నతం డచలితుఁడై. 115

వ. పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథీ యని సవ్యసాచిం బిలిచి యి ట్లనియె. 116

క. ఇది యొకచాపము విస్మయ,
మొదవించుచుఁ గొండచిలువయొకొ నాఁ [illegible]

న్నది ఖచితకనకకమలస,
ముదయద్ద్యుతిసముపగూహనోజ్జ్వల మగుచున్. 117

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహువిధంబులగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి యివి యెవ్వ రెవ్వరి వని యడిగిన నర్జునుం డి ట్లనియె. 118

తే. తొలుత నీవు న న్నడిగినదొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేడుగడయు నదియు సమరమున దేవదానవసమితి నైన, గెలుచు న్రశమమున దానివలన నతఁడు. 119

క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతితరోచిరుద్ధమోగ్రం బరిని ర్భేద్యము దివ్యజనన మన, వద్యం బిది కార్ముకైకవరము కుమారా. 120

అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించుట.

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగు వివిధసాధనంబులు వేఱు వేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మూఢాత్ముండగు నయ్యుత్తరుండు పాండవో త్తము నెఱుంగమి ని ట్లనియె. 121

క. ఈ యెడ ని ట్లిమ్మహానీ, యాయుధమును బెట్టి యెచటి కరిగిరి మన కౌం తేయులు బృహన్నలా తగ, నీయెఱిఁగినయంతవట్టు నిక్కము సెపుమా. 122

వ. అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుం గా
మఱియును. 123

క. ఏ నమ్మహానుభావుల,
నేనల్లుఁడ వార లార్యమిత్త్రులు శత్రు
క్ష్మానాయకగర్వతమో,
భానులు బంధుహితకార్యపరతంత్రాత్మల్. 124

తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగి యున్న,
వాఁడొ భీముని పార్థుని వర్తనంబు
లెయ్యెడల నేమి చందంబు లయ్యె నక్క,
టా విధాత్రుండ కవ లెందు డాఁగిరొక్క. 125

క. భూపాలవల్లభాజన,
దీపిక యనఁ జాలు ద్రౌపదికి నెయ్యెడలం
దేపాటులు వాటిల్లెనొ,
కాపురుషులవలన నిట్టికాఱియ వుట్టెన్. 126

క. కపటద్యూత మొనర్చిన,
నృపతియు దుర్యోధనాది నీచుల వలఁ బా
ఱి పడియెఁ గడుఁ బెక్కుడుమల,
రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుం డయ్యున్. 127

క. వినఁబడ రెచ్చోటను దమ,
వినుతమహీరాజ్యమహిమ విడిచి చనుట నే
మని వినియెదనో నీచే,
ననుడు నతం డిట్టు లనియె నాతనితోడన్. 128

వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చినయాపదకు నోర్చి బాస దప్పక తారును బాంచాలియు నొక్కటఁ బంద్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁడగునేఁ డజ్ఞాతవాసంబు సలుప వలయుట నిట వచ్చి మనవీట నవ్యాపన్నులై యున్నవారు వినుము వారి నెఱిం గించెద. 129

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల,
లాంకుఁడు భీముండు గవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి,
నింకఁ గొఱఁత వెట్ట నేల యే నర్జునుఁడన్. 130

తే. అధిపనందన మాలిని యనఁగఁ బరఁగు,
కాంత ద్రౌపది దానికై కాదె సింహ
బలునిఁ దమ్ములఁ గంధర్వపతులు సంపి,
రనఁగఁ జంపె మహోగ్రత ననిలసుతుఁడు. 131

వ. అన విని యుత్తరుండు చిత్తంబున నద్భుతహర్షంబులు వొదువ ప్రమాను డిగ్గన ఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండ ప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలచి యి ట్లనియె. 132

ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట.

ఉ. బాహుసమగ్ర శత్రుమదభంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర

ద్దేహముతోడ భాగ్యమయ దేవత సన్నిధిసేఁత గాదె స
మ్మోహము వాసెఁ జిత్తము ప్రమోద రసత్వముఁ బొంది
పొంగెడున్. 133

క. ని న్నెఱుఁగక యే నేమే,
నన్న పలుకు లెల్ల మఱచి యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ
నన్నుం గృపఁ జూడవే సనాథుఁడ నగుదున్. 134

క. అన వినుచుఁ దేరు డిగి గ్ర,
క్కునఁ గౌఁగిటఁ జేర్చి విరటుకొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన,
కనుఁగవఁ గడు నశ్రువారి గడలుకొనంగన్. 135

వ. ఇట్లు సమాలింగితుం డై 136

చ. మనము కలంక దేఱె రిపుమర్దనవిక్రమ యెక్కు తేరు నీ
ఘనభుజశక్తి ప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండ నై
యని మొన సారథిత్వముమహత్త్వము వైరులు మెచ్చఁ
జూపెదన్
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు
గోవులన్. 137

క. మనమునఁ గోరుదు నే న,
ర్జునునకు సమరమున రథ్యచోదకభావం
బున బనిసేయ వలయు నని,
యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్. 138

వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కి ట్లనియె. 139

మ. ప్రియ మక్షీణము నాకు నీదెస మదిన్ భీతి ప్రదోద్వేగసం
శయముల్ సేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదు దృష్టి నిను నశ్వవ్రాతముం జోఁక గా
లియు రా నీను దృణీకరింపు రిపు దోర్లీలాస
ముల్లాసమున్. 140

వ. అనిన విని భూమింజయుండు సవినయంబుగా ని ట్లనియె. 141

క. నిను నర్జునుం డని యెఱిం,
గినయంతన పాసె నెల్లకిల్బిషములు నీ
తను వేల షండభావం,
బునఁ బొందెనొ యెఱుఁగ వలయుఁ బుంస్త్వాభరణా. 142

చ. అనవుడు నాతఁ డి ట్లను మదగ్రజు పంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహితం బగురూపముఁదాల్చి యేకహా
యనపరిపాలనీయ మగునట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజితనంబు లోకులకుఁ బేడితనం బయి తోఁచె
నిమ్మెయిన్. 143

వ. అదియును నిట మీఁద లే దనినఁ బ్రమోదమాన
మానసుం డయి మత్స్య పతిసూనుండు పాండుసూనున
కి ట్లనియె. 144

ఆ. ఇట్లు దెలియఁ జెప్పు టెల్ల నాదెస దయ,
పెంపుతోడికూర్మి పేర్మిఁ గాదె

యింక సురలకైన శంకింతునే భవ,
ద్బాహువప్రగుప్తి బలుపు గలుగ. 145

వ. నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండును గాండీవంబును గాంచనపుంఖంబు లగు బాణంబులు గల తూణీర యుగళంబును మదీయతనుత్రాణ కృపాణంబులును బుచ్చికొని తక్కనవాని నెప్పటిభంగిన కట్టి పెట్టి ర మ్మని నియోగించిన నాతండు నట్ల చేయుటయు నమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవతలకుం బ్రణమిల్లి భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు గైకొని సవిశేషస్ఫూర్తియగుమూర్తి నత్యంత దర్శనీయత్వంబు నొంది. 146

క. బలరిపుఁ డిచ్చినకుండల,
ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తి మెయిం
దలఁప నవి వచ్చె వెంద్రుక,
లలవడఁగాఁ బాచి ముడిచె నమర దృఢముగన్. 147

క. తలచుట్టు చుట్టెఁ గుండల,
ములు వెట్టెను ద్రిండు గాఢముగఁ గట్టెఁ గరం
బుల వలయంబులు గనుఁగొని,
యెలన వ్వాలయంగ నెక్కె నేడ్తెఱ రథమున్. 148

వ. అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 149

క. పెట్టక కట్టక హాళిం,
బుట్టినక్రియ దీధితులు నభోభాగంబున్

ముట్టి వెలుంగఁగ నింద్రుని,
పట్టి కిరీటంబు వోలెఁ బ్రస్ఫురితం బై. 150

వ. ఇవ్విధంబున సన్నద్ధుం డై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధంబులు పదిలంబుగా నిడి తను త్రాణతలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని గాండీవంబుఁ బుచ్చికొని యెక్కు వెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన. 151

తే. పక్షిమృగజాతు లెల్లను బ్రమసి యుట్టు,
నట్టుఁగలగొనఁ జెదరె వృక్షాళియదరెఁ
గురుబలంబును బెదరె నంబరము దిశలు,
బూరటిల్లంగఁ దొడఁగెఁ దదారవమున. 152

వ. తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దన వరంబున మున్న కలిగి విశ్వకర్మనిర్మితంబును మాయా మయంబును వానరాకారంబును నగుమహోగ్రకేతనం బును దదాశ్రితంబు లైనవికృతాభీలనానావిధభూతం బులఁ బుత్తెంచిన నుదాత్తచిత్తుం డయి యుత్తరుసింహ పతాకశమీవృక్షంబునం బెట్టించి నిజధ్వజంబు రథం బునం గట్టించి దివ్యంబుగావున దేవదత్తంబుచిత్తజ్ఞత్వం బున సన్నిధి సేసిన సవినయంబుగాఁ గైకొనియె నక్కు మారుండును నాయితం బై నొగ లెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబులయంగంబులు దొడయుచు వానిజవసత్త్వంబులు వేఱువేఱ వర్ణించిన. 153

## అర్జునుఁ డుత్తరసారథికం బైనరథం బెక్కి దేవదత్తంబు పూరించుట

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవ ని
మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
నడసఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బిట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖ
మొత్తినన్. 154

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్రమల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె
నవ్వేధయున్. 155

తే. అపుడు నిశ్చేష్టితంబు లై హయము లవనిఁ,
జాఁపకట్టుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై మ్రందినట్లు,
మ్రొగ్గతిలఁ జాఁగిబలితంపుమూర్ఛఁ బొందె 156

చ. కనుఁగొని ఫల్గునుండు దురగంబులవాగెలు పట్టి యొత్తి త
త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృతం బగురూపము చక్కఁజేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి గరిమంబుగఁ గౌఁగిటఁ జేర్చి
యిట్లనున్. 157

తే. శంఖభేరీరవంబులు సామజముల,
బృంహితంబులు వింతలే పృథుల సైన్య
పరిచయోదాత్తు లగునరపాలసుతుల,
కెలమిఁ బొందుము దీనికి నింత యేల. 158

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ డాతని కి ట్లనుఁ దొల్లి శంఖని
స్వనములు విందు భేరులరవంబులు విందుఁ గరీంద్రబృంహిత
ధ్వనులును విందు నద్భుతవిధంబుగ ని ట్లవి యెల్లఁజి త్తమో
హన మొనరింపఁ జాలునె మహానినదం బిది యోర్వ
వచ్చునే. 159

చ. చెవు లవిసెన్ దిశల్ దిరిగెఁ జి త్తము నీ యయిపోయెనాకు నీ
రవమున నిమ్మహోగ్రకపిరాజపతాకయుఁజూడ్కిఁ జీఁకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవదఖండితతేజము పర్వియాత్మకున్
వివశతఁ జేయుచున్నయది విహ్వలభావము మాన
నేర్చునే. 160

క. అన విని తగుమాటల నా,
తనిఁగొందలపాటు పాండుతనయుండు గ్రమం
బున డిందుపఱిచి యరదము,
ననఁగా నెఱిఁగించి పట్టె శంఖము మఱియున్. 161

వ. ఇత్తెఱంగున నయ్యు త్తరకుమారు ధీరుం గావించికొని
పాండవవీరుఁడు రథనేమి నిస్వనజ్యానాదమేదురం బగు
శంఖారవంబు సెలంగ నడచుసమయంబున గాంగే
యుండు దుర్యోధనున కిట్లనియె. 162

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డనశ్యము గెల్తుమనంగ రాదు రా
లచ్చికినై పెనంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుందగుం దొడరు నెల్లవిధంబుల కోర్చుటట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమొయి నిత్తఱిఁ బొం
దగుచేఁతయుం దగున్. 163

వ. అనిన విని కురుపతి దరహసిత వదనుం డగుచు నిట్లనియె. 164

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు,
నెట్టి పొందు గలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ,
నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 165

వ. అనిన నయ్యుగ్రపురవచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ గార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లే రయినను నా యెఱింగిన యంత నొక్కటెఱంగు సెప్పెద నీ బలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందర పోవ వలయు నంతియ సేన తదనంతరంబ కదుపులం బొదివికొని చన వలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లసల్ల నరుగ వలయుఁ గవ్వడి యయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడిం బడక నడచు గోవులు నిన్నెలం గడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యట దోడుపడ నెవ్వరు గలిగినను వారికిం జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబు బంచి యిచ్చి పుచ్చి పసులకుం దో డగుభాగంబునుం బంచి యున్నంత వట్టు చతురంగంబుల నియతి సేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్రుండు దాపటం గర్ణుండు ముందట వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లీకభూరిశ్రవః

ప్రభృతియోధవీరు లెల్ల నెడ నెడం గలయ నిలుచు
నట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహ
సౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసి
తాను వెనుక యయి నడపించుచుండె నట్టి
సమయంబున. 166

చ. అరుదుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకున్ మహోగ్రసం
గర మగుడున్ మనం బతులకౌతుక మొందికనుంగొనన్ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కువిమాన మెక్కియం
బరగతి వచ్చె దేవముని పంక్తులు సిద్ధగణంబుఁ
గొల్వఁగాన్. 167

వ. అద్దివ్యయానరత్నంబునందు. 168

తే. స్వర్గమున నున్న రాజులుఁ జక్రవర్తు,
లును యథోచితచ్ఛత్రంబులును నిజార్హ
చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ,
గొలిచియుండిరి వేడ్కలు గొనలునిగుడ. 169

క. పాండుమహీపాలుం డా,
ఖండలు చేరువన పెద్దగద్దియ నమరీ
మండలి వీ చోపు లిడఁగ,
నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వలభంగిన్. 170

వ. అంత. 171

సీ. దేవదత్తాభీలరావంబు వెసఁ గర్ణ
ములు దీటుకొన లేటమొగము పడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు
లెల్లఁ గప్పఁగ వెలువెల్ల నగుచు

బహుళకపిధ్వజప్రభలు లోచనములు
మిఱుమిట్లు గొనఁ బర్వ మేడుపడుచు
నుద్భటాకారసముద్ధతి మనములు
త్తలపాటు దోఁపంగఁ దల్లడిలుచు
తే. నడచుకౌరవరాజసైన్యంబుఁ గదిసెఁ,
దీఁగ దిగిచినగతిఁ దనతేరు మెఱయ
రయమునఁ జని ప్రళయభైరవసహస్ర,
గర్జనోదగ్రతర్జనుఁ డర్జునుండు. 172

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ గ్రోశద్వయంబునం గూడ ముట్టి క్రీడి తల యెత్తిచూచి యుత్తరున కిట్లనియె. 173

చ. ఇది యొకపెదగట్టి మొన యీమొనముందటగోగణంబుతో
నదె యొకయల్పసైన్యము ప్రయాతల వే ఱొకకొంతసేన యు
ల్లదె యిటు వంచి పెట్టఁ జనునంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురురాజె చటం జనుచున్న
వాఁడొకో. 174

క. అరయుదము గాని యిమ్మో,
హరమునకును డాపలించి యరదముఁ బోని
మ్మురవడి నతనిక యిటికేద,
నరుదుగ నెబ్బంగి నెవ్వ రడ్డం బైనన్. 175

ఉ. ఆతఁడు సిక్కెనేని బలమంతయు విచ్చు మరల్ప వచ్చు గో
వ్రాతము నట్ల యైన సుకరంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతతసేనయం దతని నారసి కానక యున్న వీరి ని
ట్లీతలడించి యాకదుపు నెఱ్ఱఁగఁ బోదము గాక
వ్రేల్మిడిన్. 176

క. విచ్చి చన కుండఁ బసులం,
దెప్పట మానుచున్న వలయు తెఱఁ గాపనికిం
జొచ్చి యదె ప్రక్కఁ బెట్టఁగ,
నచ్చోటన దాయ మనకు నగపడెడు బలే. 177

## యు ద్ధా ర ం భ ము.

క. అనుటయు విరాటతనయుఁడు,
మొన కడ్డముగాఁగఁ దూర్పు మొగమై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ,
దనముూఁపులు రెండు నపుడు దలకుం గడనన్. 178

వ తేరు సమ్ముఖంబు సేయించి పేరు వాఁడి క్రీడి కరతలం బెత్తి నిలునిలు మని యదల్చిన ఘోషంబుతోడన వెడలునిశితశరపరంపరల దట్టంపుఁబఱపున నంబరంబు నీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయ తిమిరంబునుంగవిసి గుండియ లవిసి కురుబలంబు లెదుకు నడవను మరలం బఱనను మఱచి నెఱచఱచి హరి తనయహస్తలాఘవప్రశక్తి దక్కం దక్కిన చేష్టలు దక్కియుండె నతండు గోవుల వెనుకం బోవు నల్ప బలంబు బెదరి తూర్పుదెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపి సూపి వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబు లార్వ హార్వ్రరవంబును రథనినదంబును బ్రతిపత్తాకినీతుము లంబును గగనంబునం బొగడునమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీ

కుహరంబు నిండిన నొండొండ మట్టు లెత్తుగొని నేలను
ట్టువియుచు నమ్రమువం బసులు వెసం దిరిగి మున్న విన్వ
చ్చుండు వచ్చినజాడ గైకొని దక్షిణదిశకుఁ గెరలు
వోడుచుచుం దెరలం బాఱిన. 179

క. గోవులతోఁ బొదువంబడి,
పోవుచు నున్నట్టి గోపపుంజంబు దదీ
యావసరంబున సరభస,
మ్మై వానిపిఱుందఁ దిరిగి యమ్మెయిఁ బఱచెన్. 180

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యా,
బలము పసుల కడ్డపడక యుండ
నెడ సొరంగ వలయు నిట యెద్దుకొనుమని,
పనిచె మత్స్యభూమిపాలసుతుని. 181

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ,
జన నిచ్చె రథంబు గోపసంఘముఁ దిరమ్మై
కొని పొండు పసుల నోడక,
యని తా నెలిగించి సీటికై నూల్కొలిపెన్. 182

వ. అట్టిసమయంబున. 183

క. కరితురగసమితిఁ గార్కొని,
కురువీరుల మొనలు మొగులుకొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁడు,
ద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరల్చెన్. 184

క. కదిసినబలములు విచ్చినఁ,
గదుపులు చెదరంగ నీక గాండీవి వెసం

బోదివి యట కడపె నవియుచు,
గోదగొని తమపాలనుసొచ్చె గోపాలురతోన్. 185

వ. అట్టియెడఁ గదుపులు వట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనంబులతోడ నెన్ను దన్ని నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదిగొని యమ్మెయిన దళంబుగాఁ గవిసిన. 186

క. కనుఁగొని యెలన వ్వాలయు వ,
దనమున గరువంపుఁజెన్ను దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి,
ట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్. 187

సీ. కాంచనమయవేదికాకనత్కేతనో
జ్జ్వలవిభ్రమమువాఁడు కలశజుండు
సింహలాంగూల భూషితనభోభాగకే
తుప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు
గనకగోవృషసాంద్రకాంతిపరిస్ఫుట
ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు
లలితకంబుప్రభాకలితపతాకావి
హారంబువాఁడు రాధాత్మజుండు

తే. మణిమయోరగరుచిజాలమహిత మైన,
పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘనతాళతరు వగుపడమువాఁడు,
సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము. 188

వ. అని యిట్లు వేఱువేఱ చూపి క్రమంబున నేర్పడం జెప్పి
సవ్యసాచి సమరోన్ముఖుం డగుసమయంబున. 189

చ. ధరణి వడంకె ధూళి దివిఁ దన్నిన భానుని గానరాద బం
ధురవివిధప్రకారపటుతూర్యరవంబులఁ బొంగె దిక్కులా
స్ఫురితమహాయుధోగ్రరుచిపుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖదైవతమండలదుర్నిరీక్ష్య మై. 190

అర్జునుడు గౌరవ సైన్యంబుల నుఱుమాడుట.

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు
శతమఖతనయుండు. 191

చ. గుణమున లస్త్రకంబునను గోటియుగంబునఁ గేలఁ దార భీ
షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగినమాడ్కిఁ దీవ్రమా
ర్గణనికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్. 192

క. తలపడి తలమిఱ్ఱాటిన కా,
ల్బలములఁ బొడిసేయు మఱియుఁ బైపైఁ బీనుం
గులఁద్రొక్కికొనుచు నెస ముం,
గల మొనఁగవియుటకు వేడ్కగడలుకొనంగన్. 193

క. తనదృష్టియు ముష్టియుఁ దగు,
ననువ్రున ముస్నెత్తి యేయునతఁ డప్పుడు డిం
చినగాయమ్ముల సపాటమ్ముం
బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్. 194

చ. ఉడుగక నెంచియున్ సుభటు లొక్క మొగిన్ వెస
నంటఁ దాఁకి క
వ్వడిపటుబాణభాస్వదనివార్యసముద్ధతిఁజేసి మంటలో
మిడుతలు సొచ్చి న ట్లయిన నేటివిమగల్గని యీడఁబోక బ
ల్విడి మఱియున్ వడిం బొదువ వ్రేల్మిడిఁ ద్రుంచె
నతండు దోడుతోన్. 195

తే. అంత కంతకుఁ గదిసి సైన్యములు సుట్టు,
ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గిరీటి గాండి,
వంబు పరిచాలనంబు దీవ్రంబు గాఁగ. 196

సీ. గోరఁ బోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ
బాలుగా వ్రయ్యలు వాపి పాపి
బాడిన నఱకినభంగిఁ గొన్నింటిఁ దు
త్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి
వెస అంపమున నిఢ్వపిగఁ గొన్నింటి నిసు
మంతలుగా నుఱుమాడి యాడి
పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ
జిఱునుగ్గుగాఁ బొడిసేసి చేసి

తే. యడరిపొదివినబలమునానాయుధములఁ,
బ్రతిహతంబులఁగావించె నతిరయమున
నక్షతధ్వజసూతహయయత్వలసద,
ఫల్గురథవల్గనుం డగుఫల్గునుండు 197

క. ఆమెయిన విధివర్మ, స్తోమం బలువ్రుళ్లు సేసి సునిశితబాణో
ద్దామప్రసారవిభవ శ్రీమాఱ్ఱుర కద్భుతంబు సేసెం
గడిమిన్. 198

క. గర్జద్గుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ, నిర్జరవరనందనుండు
నిమిషార్ధమునన్. 199

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజాసంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబులక్రియన్ రంజిల్లి
యొప్పెంగడున్. 200

చ. దదవసరంబునన్ దొర లు దగ్గఁ ద్రోచిన వజ్రఘట్టముల్
మదమున నొక్కపెట్ట బలమర్దనుసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణులభూరిరవంబుఁ గరీంద్రఘంటికా
భ్యుదితనినాదమున్ రథవరోత్థితఘోషము
నుత్కటంబుగాన్. 201

తే. అట్టియెడ వేల్పు వచ్చినయట్ల మేను,
వొంగ నలరేఁగి పాండవపుంగవుండు
మత్స్యనృపనందనుని బలుమాటఁ ద్రోచి,
యేపు సెవికిని జూడ్కికి నింపు నొసఁగ. 202

క. మేదురదీర్ఘతరం బగు,
నాదం బెడ తెగక గుణమునను వడి నిగుడం
గోదండము సంతతవల,
యోదాత్తస్ఫురణ వెలుఁగు చుండఁగ నేసెన్. 203

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడాత్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబు లై యాగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమార్తాండునన్
విడంబించుచున్. 204

క. నరు లోఁకులు దృశ్యములపైఁ,
బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు వడుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయునిశిత,
శరములు లక్ష్యములు దప్పి చన వించుకయున్. 205

క. గజఘోటకరథసూత,
ధ్వజకంకటయోధగాత్ర తతియం దెచటన్
విజయధనుర్ముక్తశర,
వ్రజములు దవులంగఁ బడ కవారణ నిగుడున్. 206

చ. కవదొన లేల పూనునొకొ కవ్వడి నా వల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చిమార్చి గాం
డివము ధరింపఁగా శరపటిష్ఠతయుం బొరిఁ జేయిమార్చి చూ
పు వెరవుతోన పీడ్వడక పొం దొడఁగూడెడు నెవ్వ
నూచినన్. 207

క. సమవిషమవినిమ్నోన్నత,
సమీప దూరస్థలములు సదృశములు గఁ జి
త్రముక్రియ నవిహతగతులను,
సమరమహిం గ్రీడిరథము సను నవితథ మై. 208

వ. వెండియు నతండు 209

మ. బలమెల్లన్ వెఱ రెండుపాయలుగ శుంభద్వేగుఁడై చొచ్చి యా
వలగా నడ్డమువచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై
వలయంబుల్ సని చించి చిక్కువఱుచున్ వైకల్యసంపాదియై. 210

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించు చందంబునఁ దదీయరథంబు గౌరవసైన్యంబునందు సంచరించునయ్యవసరంబున. 211

ఆ. రత్నకేతనములు రాజితశేఖరం,
బులును రుచిరఘంటికలును బార్థు
బాణనిహతిఁ దునిసి పడుఁ గౌరవులచేటు,
దెలుప డుల్లు నుల్కలునుబోలె. 212

క. నరుభల్లంబుల నగ్రిమ,
చరణంబులు ద్రెస్సి మ్రొగ్గుజవనాశ్వంబుల్
కరుణమెయి రాహుతులకున్,
శరణం బగుమనుచు మ్రొక్కు చందంబొందెన్. 213

క. దంతిఘటాసంతానము,
కుంతీసుతునారసములఁ గూలినతతి న
త్యంతనిబిడాభ్రముల దివి,
యెంతయు సొంపారుభంగి నిల సెలు వొందెన్. 214

క. పలుపులుఁ గొండ్లుం బగ్గం,
బులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాఱెడురథ్యం,
బుల నేయఁడు దివిజరాజపుత్త్రుఁడు కృపతోన్. 215

ఆ. అర్జునాస్త్రఖండితాతపత్రధ్వజ,
చామరములు గాలిఁ జదలఁ దూలఁ
జిహ్నములవిభూతిఁ జెందంగఁ గని యొప్పె,
నవ్వు డాడుచున్నయట్టు లచట. 216

క. ఒకమరి కిరీటికస్త్రైది,
రికి నుఱుమునఁ బోయి రేని రెండవమాఱి
య్యకొనుట కోర్వఁగ లేరై,
రొకళ్లఁ గురురాజుసేన యోధులలోనన్. 217

సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి
విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర
యంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధరథసమూహముఁ జొచ్చి
గలిబిలి యగునట్లు గలఁచి కలఁచి
మదభరభీషణమాతంగముల ముట్టి
చిందఱవందఱ చేసి చేసి

ఆ. పటుపదాతిచయముపై రౌద్రరసమహో,
గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచిబాణసంఘంబు మత్తశుం,
డాలఘోరలీలఁ గేలి సలిపె. 218

ఉ. శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిహేతిఖండనా
దక్షతపెంపుసొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ

ప్రాక్షతనూజుసారథిరథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము వెక్కస మంది
బెగ్గిలన్. 219

క. తేజోధనుఁ డగునరుఁ డు,
ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం
బై జలనిధిఁ ద్రెక్కొనియెడు,
నోజం గురుబలముపేర్మి యుడిపెం దోడ్తోన్. 220

తే. కాలపక్వంబు లైనలోకముల జముఁడు,
బారిసమరెడుచాడ్పున మారి మసఁగి
యుగ్రరూపుఁ డై శౌర్యసమగ్రబాహుఁ,
సంపదుద్దాముఁ డగు క్రీడిసంపె రిపుల. 221

తే. ఇవ్విధంబునఁ బోరెడు నింద్రతనయుఁ,
నుక్కులావును నంతంత కెక్కుడయ్యె
నలసి మేనులు దూలాడ నిలిచి రంత,
నంత నయోధ్యాధముఖ్యు లాహవముదక్కి. 222

వ. అట్టియెడ నుత్తరుండు నరున కిట్లనియె. 223

చ. ఉడుకువ లేనికయ్యమున కోర్వఁగ వచ్చునె నాకు డప్పి వు
ట్టెడు నొకమాటు నాగ్రహముడింపవు నీవును జక్కసేసి ప
చ్చడి గలపంగ నెండియును జిడ్డితనంబులు వచ్చి వచ్చి పో
రెడు మొన లింకఁ జాల నొనరింప భవద్రథ
సూతకృత్యమున్. 224

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నోహటింప
నేల యంతియ వలసినం దురంగంబులఁ దోడు గడపెద
నించుక సైరించి నిలువ వలయు నిల్లవసనులును జక్క

నయ్యో రా జొక్కరుండు గొఱింత యాతం డభిమాని
మనలంగని సరకు గొనఁ డిప్పు డున్న చందంబు మెస
గోడం దలపడం గడంగుట దోఁచుచున్న యది తమ్ములు
నా ప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి డగ్గఱి
యున్న వారని కౌరవేశ్వరునిగట్టి మోహరంబు నూపి
యతనిం బురికొల్పి యద్దిక్కు దేరు వోవని మ్మనుటయు
నతండును దలకొని యట్ల చేయు నవసరి యెడనెడ నడ్డ
పడు కురువీరులం జెఱునగవు గెడ నిగుడ మెఱుంగు
వాలమ్ములఁ దొలంగ జడియుచుం గదిసిన నమ్మేది
నీవల్లభుండు. 225

అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధము సేయుట

క. పులి గోల వేసిన ట్టి,
ట్టలపురయంబునఁ గడంగుటయుఁ దద్వక్ష
స్స్థలమునఁ గిరీటి రెండ,
మ్ముల నాఁటఁగ నేసె బొమలు ముడివడు చుండన్. 226

క. క్షతిములఁ బెల్లు దొరఁగుశో,
ణితధారలు మదముగా విన్నిగ్గళకరియా
కృతిఁ గవిసి యతం డేసెను,
శతమఖసుతుఫాలతలము శాతశరమునన్. 227

తే. రక్తధారయు నెడలంగ రశ్మి నెలుఁగఁ
బొలుచు బాలార్కుచాడ్పునఁ జెలువు మిగిలి
ఫల్గునుండు ప్రతాపసంభరితమూర్తి
యగుచు శరకిరణంబులు నిగుడఁ జేసె. 228

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గర్వం బెక్కి నానాస్త్రసం
తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దుర్దాంతాకృతిన్ గ్రోతభి
తూ్సనుండుం బటుసాయకోత్కరమునం జూపెన్ భుజాటోప మి
ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరంబేపారఁగా
నయ్యెడన్. 229

తే. హాస్తిపురిఁ బేరు గల మదహస్తి నెక్కి,
క్రాలుకావలిరథములు గవియుదేర
నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప,
వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె 230

ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసముదగ్రత నెత్తినిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోడ నున్న జమునాకృతి భీషణరేఖ యొప్పఁగా
వేఁకనినారసంబు దొడి క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్ 231

ఆ. ఫాలకుంభసంధిఁ బడి వాలమున వెస,
నుచ్చిపోవుటయును నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు గులిశచండాహతిఁ,
బడుమహానగంబుభంగి దోఁప. 232

క. అరుణమణిమాలికావి,
స్ఫురణంబున దంతితనువు సూడఁగ నొప్పెన్.
ధరణిఁ బడియున్న బహుముఖ,
పరిగతదావాగ్నిఁ బొల్చుపర్వతము క్రియన్. 233

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుం గైన వికర్ణుండు వెఱచఱచి
పఱచి వివింశతిరథంబ్బెక్కె నాలోనన యట్టినారాచంబున
రారాజునురంబు నో నాట నేసినఁ గ్రథింద్రుండు వధు

టయు నరేంద్రుండు నొచ్చుటయుం గని తిచ్చవడు
రథికుల వివ్వచ్చుం డనర్గళప్రసారం బగుమార్గణా
సారంబున ముంచిన నెగడుపడి విఱిగి పాఱి రిత్తెఱంగునఁ
దనచుట్టును బయ లైన నయ్యురగకేతనుండును మరలె
నిట్లు దొరయును విఱిగి కలను వాసి కాలుద్రోసిపోవు
టయు నతిరథమహారథు లెల్లం జెల్లాచెద రగుటయుం
జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి
కనుకనిం బఱవం దొడంగిన. 234

తే. యూథపతితోడిదంతి సముత్కరంబు,
వెనుకఁ దగిలెడుసింగంబువిధము దోఁప
నార్పు నాదంబుగా నరుఁ డంటఁ దాఁకె,
రాజుఁ దారును బాతెడురథికవరుల. 235

క. వెనుకొని కర్ణుని పెడతల,
యును దుశ్శాసనునివీఁపు నొక్కొక్కశరం
బున నేసె నప్పు డయ్యన,
తనయుం డి ట్లనియె నతిరథశ్రేష్ఠులతోన్. 236

ఆ. కూడి ముట్టెఁ గ్రీడి కురువంశమున కెల్ల,
మూలకంద మీనృపాలుఁ డతని
నిచటఁ గాచికొనుట యెల్లపౌరుషములుఁ,
జేఁత నిలిచి లావు సేయవలయు. 237

క. అనవినుచుఁ గురుపితామహుఁ,
డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁడునుగృపుఁడును గ
ర్ణునిమాట సరకు సేయక,
చను చుండఁగ దీనవృత్తి జనపతి పలికెన్. 238

క. లోకంబులకోడివారుగ,
మీకుం జనునయ్య మగఁటిమిని గుఱి గాదే
నా కెడ రైనయెడం దగఁ,
జేకొని యది మీకు చక్కఁజేయుట యరయన్. 239

వ. అనిన విని వారలు వెనుక నై యాశ్వాసనవచనంబులు వలుకుచుం బోవం బోవుచున్న యన్నరేంద్రు నెలుం గెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. 240

అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట.

ఉ. క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ జిన్న నినుఁ బోరికిఁ బిల్వఁగ మాని నాఁగ ని
ర్ధాత్త్రిఁ బ్రసిద్ధి కెక్కు బలదర్పసమగ్రుఁడ వైననీవు నీ
మిత్త్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ
భూభుజుల్. 241

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ
రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయం బైనభూషణజాలముల నొప్పి
యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూరచందనకస్తూరికాదుల
నింపు సొంపార భోగింపఁ గలదె
యతిమనోహర లగుచతురాంగనలతోడి
సంగతి వేడ్కలు సలుపఁ గలదె,

తే. కయ్యమున నోడి పోయినఁ గౌరవేంద్ర,
వినుము నాబుద్ధి మరలి యీతనువు విడిచి
సుగతి నడయుము తొల్లింటి సూఱగలదె,
జూద మిచ్చట నాడఁగ రాదు సుమ్ము. 242

వ. అని వెండియు. 243

క. నీయట్టివాఁడు నిన్నీ,
పోయెడిదే యిట్లు పోకు పోకు మనుచు భూ
నాయకుఁడు మరలి పటుకో,
పాయత్తతఁ ద్రొక్కఁబడ్డయహిగతిఁ గవిసెన్. 244

వ. ఇట్లు గవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మ ద్రోణాదియోధవీరులు నొక్కుమ్మడి. మగిడి యధిపతి తోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి తక్కిన బలంబులు నంతకు మున్న కౌంతేయుదెస మరలి చూచుచుం బాఱుచునికిం జేసి యేలినవాఁ డఱుముటయును దొరలు దెగి తిరుగుటయుం గని తెంపుసేసి కూడికొని రభసంబునం జుట్టు ముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె. నివ్విధంబున వివిధవ్యూహంబు లగుబహుయోధయూథంబులు గురిసినయనేకాస్త్ర శస్త్రంబులు నానాప్రకారంబులఁ గుప్పంగూరలు గాఁ దొరగినం బెరిఁగిన శౌర్యసంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్యధుర్యనిరతిశయరయభరితశర యుగళుం డయి రథరథ్యసారథిస్వాంగంబులు గాచికొని తనతోడంబుట్టువుల ప్రతిన లూహించి యొండుసేయ నొల్లక సపరిహారం

బుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టం దలంచి యింద్ర
దైవత్యంబును సత్యసంవాదనంబును నరాతి సైన్య
దైన్యసంపాదనంబును నగు సమ్మోహనాస్త్రంబుఁ
బ్రయోగించిన. 245

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగఁ
దలలు మెడలుఁ జిక్కనిలువలేక
నెల్లవారు నెఱుక నెడలి చొక్కిరి క్కని,
ద్రాతిశయము గూరినట్లు లైరి. 246

వ. అప్పుడు పాండవోత్తముం డుత్తరమాటలు దలంచి
యుత్తరుం గనుంగొని. 247

సీ. ఇక్కురుసైన్యంబు సొక్కి దక్కకయున్న
గ్రక్కునఁ జనుము రారాజు ద్రోణ
తనయుండుఁ జుట్టినతలచుట్లు నల్లని
యవి సూతపుత్రుశిరోంబరంబు
పచ్చనియది కుంభభవకృపాచార్యుల
యుష్ణీషములు వెల్ల లుఱక నీవు
దెమ్మింతవట్టును దేవనదీసూనుఁ
డిమ్యస్త్రమునకు మా తెఱుఁగుఁ గాన

ఆ. యతఁడు దెలిసియుండు నాతనిదెస వోకు,
మ్మణిన మత్స్యరాజతనయుఁ డెలమిఁ
దోలుక నొగలఁ బట్టములలో గట్టిచని వాని,
నెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును. 248

వ. ఈ రథబృందంబుల యిఱకటంబు వెడలి నిలుత మని
కదలినం గిరీటిం దాఁకి గురుపితామహులుండు శరవర్షం
బులు గురిసిన. 249

క. ఆతని రథ్యంబులఁ ద,
త్సూతుని నొప్పించి సాంద్రసునిశితబాణ
వ్రాతంబు మేన నించి పృ,
థాతనయుఁడు నిలిపి వెడలె దర్పోజ్జ్వలుఁడై. 250

వ. ఇవ్విధంబున నరదంబులయిఱకటంబు గడచి యెడ
గలుగ నిలిచి రాహు నిగ్రహానిరాసభాసురుం డగు
భానుండునుం బోలె వెలుంగుచున్నంత బలంబులు
దెలిసిన. 251

ఆ. కౌరవేశ్వరుండు గను విచ్చి దిక్కులు,
గలయఁ జూచి పార్థుఁ గాంచి కడఁగి
యుదరఁ జూచుటయును నమరనదీసూనుఁ,
డతని కిట్టు లనియె నల్ల నగుచు. 252

క. ఇంత యెఱుంగవు సైన్యము,
లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహా
క్రాంతంబులయ్యెఁ బని దెగుఁ,
గౌంతేయుఁడు పోరఁడుగాని క్రౌర్యంబునకున్. 253

క. మెడ యొఱగఁ జేతికై దువ్వు,
వడ సిను నీ వెఱుఁగ కున్న భంగి గవియుఁ గ
వ్వడి యూర కుండు నలె చె,
ప్పెడుకోలఁదియె వానికరుణపెంపు కుమారా. 254

వ. అతండు మనప్రాణంబులపై రానొల్లక నిలిచిన మన
మింతట నిలుచుట కార్యంబు. 255

ఉ. మోహనబాణపాతమున ముందలచీర లెఱుంగ కున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితి మేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట
మార్గణాగ్నికిన్. 256

వ. కావున. 257

క. మనదేశమునకుఁ బోదము,
మన మల్లన తెరువు వట్టి మత్స్యవిభునిఁ గో
ధనముఁ గొని యతఁడు ప్రీతిం,
జనుఁ గాకటు మనకు నంతచల మేమిటికిన్. 258

దుర్యోధనుఁడు పరాజితుఁడై మరలి తనపురంబునకుఁ బోవుట.

వ. అని చెప్పినపితామహుహితవచనంబు లాకర్ణించి
సంగ్రామాతికామియుం గోపాటోపఘూర్ణమానమాన
సుండు నగునమ్మానవేశ్వరుండు నిట్టూర్పు నిగిడించి
యుద్రేకంబు దక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం
బగు నర్జునాననంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణ
తాత్పర్యంబున శౌర్యంబు సాలించి భీష్మవాక్యప్రకా
రంబు సేసి రిట్లందఱు ముందర దమవచ్చినవంకన తిరిగి
యరుగు చున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు
సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమిం బిరుదులతోఁడి

గొడుగులును నడిమూలంబులతో డిపిడంబులును వైపిం
చుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును
వినం బెద్దయెలుంగునం బోయివచ్చెద నని చెప్పి
గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు
లేసి వారి వీడ్కొనినవాఁడై మిట్టకోలల రారాజుమకు
టంబుమణులు దులిచి యతని కిం జెప్పినవాఁడై యఖర్వ
గాహోగర్వనిర్వాహణంబు మెఱయ నప్పుడు మధ్యందిన
మార్తాండప్రచండుం డగుచుండఁ గౌరవవీరు లనిం
దేఱి చూడనుం జాలక చని రతండును జూపఱం దోలి
నిలిచిన మదపుటేనుంగుచందంబున నిలచి విరాటతన
యున కి ట్లనియె. 259

ఆ. పసులు మరలె శత్రుబలములు వీనుంగు,
వెంట లయ్యె రాజుఁ బెద్దదొరలుఁ
జీర లొలువఁ బడిరి సిగ్గఱి బిరుదులు,
వైచి రింక మగుడ వలదె మనకు. 260

క. హయములు మరల్పు మీ త,
ల్లియు బంధులు నెడలు సంచలింప గుములు గ
ట్టి యెదురుసూతురు వారికిఁ,
బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ బోవలయున్. 261

వ. అనిన నతండు రథంబు మగిడించినం జని చని. 262

తే. కాలుతక్కువ వారలు గలయఁ జెదరి,
వెనుకఁబడిపోవు నెడఁ దన్నుఁ గనిభయమునఁ
బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ,
హస్తమిచ్చుచు దయ పెనుపారఁబలుకు. 263

వ. ఇట్లు నానావిధదీనదశాదందహ్యమాను లగుకృపణులం దనకృపామృతంబునం దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిలుచుం బొగడుచుం బోవు చుండ ధనంజయుండు భూమింజయుం జూచి. 264

ఆ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ,
దెచ్చు టెల్ల నీయుదీర్ణబాహు
బలము కాఁగ నీవు పలుకుము వెలిఁబుచ్చు,
టుడుగు మధిపుపాల నొండు దెఱఁగు. 265

క. అనవుడు నీచేసినయీ,
పని నాచేఁ గాకయునికి పతి యెఱుఁగఁడొకో
జనులు నిజము సేయుదురే,
నిను నెఱింగింపకయ చెప్ప నేర్తునె పొసఁగన్. 266

వ. అని యుత్తరుండు మఱియును. 267

క. నీవలచినయప్పుడ ధా,
త్రీవల్లభుఁ డెఱుఁగునట్టి తెఱఁగు నడపెదన్
దేవేంద్రపుత్ర యే ననఁ,
గా వేఱొకపేరు గలదె కార్యము నడపన్. 268

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాది సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి యెప్పటిసింహపతాక రథంబున బంధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధం

బులు గైకొని రథికుం డయి వచ్చునట్లుగాఁజేసి తొంటి చందంబునం దలచీర యలవరించికొని సారథి యై సవ్యసాచి నొగ లెక్కి నట్టిసమయంబునఁ బురందరాది బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును బాండుప్రముఖ రాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తులయి సమరవిషయంబు లయిన మాట లాడుచు నిజనివాసంబుల కరిగి రిట నఱుండు నుత్తరు నాలోకించి నీవిజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చుమనిన నతం డది దెలియంగునాఁ గైకొని యట్ల చేయ నిట్లు సగూఢంబుగాఁ బట్టణంబునకుం జనుచుండ నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పితవాహినీ పరివృతుం డై నగరంబు సొత్తెంచి. 269

తే. మందిరాభ్యంతరమున కానందలీలఁ,
బాండుపుత్రులుఁ దక్కటిబంధుజనులుఁ
దానుఁ జని విప్రులును వనితాజనంబు,
సేస లొలుక సింహాసనాసీనుఁ డయ్యె. 270

వ. ఇవ్విధంబునం దనవిజయంబు గొనియాడ వచ్చిన వారి నెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు బెరసినబలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథింగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాదవేదనాదోదూయమానమానసుం డగుచు మంత్రుల మొగంబు సూచి యి ట్లనియె. 271

విరాటుఁ డుత్తరుఁడు కురుసైన్యంబు గెలువఁ జొచ్చుట విని చింతించుట.

---

చ. ఆపదమున విరాటుఁ డెలుంగెత్తి మహోగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేకమై యొం
టి సనుట యెడ నాకిది గడిందివిచారము వృత్తి సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు వేగము పంపుఁడు చాలునట్లుగన్ 272

చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున నిట వీరికిన్ జయమవున్ వెఱ పేటికి నీకు నుత్తరుం
డన నొకరుండు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు న
య్యనిమిషకోటి నైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్. 273

ఉ. అన వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల సి
ట్లను మఱియున్ విరాటుఁడు రణావనియందుఁ ద్రిగర్తసేనచే
ననయము నొచ్చినట్టి జనులందఱుఁ దక్కఁగ నేటుఁబోటుఁ దాఁ
కని ఘనయోధకోటి సనఁగా వలయున్ బలుమై
రయంబునన్. 274

క. చని యక్కుమారుఁ డేమ,
య్యెనొ యుత్తరుఁ గెఱఁగి మనకు నెయిదించుట పు
ట్టిన కార్యమునకుఁ దగియెడు,
పని యట విధి గెలువ వసమె బ్రహ్మకునైనన్. 275

వ. అనుచు నుత్తలపడు నయ్యవసరంబున నుత్తరుండు
పుత్తెంచిన గోపాలురు పఱతెంచి యతనిం గాంచి. 276

చ. కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు నుదగ్రతవచ్చుచునున్న వాఁడు త

త్తురగరథధ్వజాలి నొక తుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే
పురి నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ వచ్చితి మేము
నావుడున్. 277

తే. అంతరంగంబు నిండి రెండలువులందు
వెడలుసంతోషపూరంబువిధము దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు
గండపులకాంకురములతోఁ గ్రమ్మ దేర. 278

క. ఏమేమీ యని గోప,
స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి వొదలన్
భూమీశుఁ డపుడు మంత్రుల,
మోములు గనుఁగొని సగర్వమున ని ట్లనియెన్. 279

శా. వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహితక్షోణీసురవ్రాతమున్
ఘోటస్యందనవారణప్రతతులంగూడన్ సతూర్యంబుగన్. 280

క. ఉత్తమకన్యాజనములు,
ను త్తరయును గంధమాల్యయుక్తముగఁ గుమా
రోత్తము నెదుర్కొనం దగు,
న త్తెఱఁగున సంఘటింపుఁ డభిరామముగాన్. 281

వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిప్పించి కంకు
నాలోకించి నెత్తం బొక పలుక యాడుదమే యని
యుబ్బుమై మాటగాఁ బలికిన నతండు నీవు సుమాళం
బున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు

వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగుసైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి పలుక ముందటికిఁ దిగిచికొనుచు నిందు ర మ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదం బాడుట యెంత లెస్స యనుచుం జేరి యాడం దొడంగు నప్పుడు మఱియు ని ట్లనియె. 282

ఆ. జూద మాడి ధర్మసూనుండు రాజ్యంబు,
నసుజులను బ్రియాంగనను బణంబు
గాఁగ నొడ్డి యాడి కాఱియఁ బడఁడె యు,
ట్లగుట దీనితోడి యర్థి గీడు. 283

వ. అని పలికి యాడు చుండుసమయంబున. 284

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబునై ని ట్లనుం గురుసైన్యంబులముట్టి గెల్చి యెలమిన్ గోవర్గముం దెచ్చె ను త్తరుబాహాబలశౌర్యసారము లుదాత్తంబుల్ గదే యెందు నె వ్వరు నెక్కాలము నిట్లు సేసిరె కులైశ్వర్యం
బవార్యంబుగన్. 285

వ. అనిన విని కంకుం డతని కి ట్లనియె. 286

చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యమహోగ్రయోధవి స్ఫురణము నోర్వఁ జాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను త్తరుఁడ జయించెనేని వసుధావర యింతటికంటె నింక న చ్చెరువును గల్గునే ధరఁ బ్రసిద్ధికి నెక్కఁడె యాతఁ
డొక్కఁడున్. 287

తే. అనినఁ గటకటఁబడి యిట్టు లాడు బెల్ల,
నతిని విజయము సందియ మనుటగాదె
యింతవట్టును సైరించి తీవు గాన,
యింక నీమాట లుడుగుము కంకభట్ట. 288

వ. అనుచు విరాటుండు గటంబు లదరఁ గన్నులఁ గెంపు
గదురఁ బలుక చప్పుడగ్గలంబుగా నాడుచున్న సరకు
సేయక యుధిష్ఠిరుండు వెండియు ని ట్లనియె. 289

చ. కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల రథంబుపయిం బరవాహినీభయం
కరభుజసారమున్ మెఱయఁగాఁదఱిగాఁ చిత్రినంచు విక్రమో
ద్ధురగతి నాజికేళినిరతుం డయి దుర్గమలీల నుండఁగన్. 290

వ. అనిన విని సక్రోధహాసోల్లాసవిక్ృతాస్యుండై మత్స్య
మహీనాథుండు. 291

ఉ. వింతలు సాల నీవలన వింటిమి గాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల నెవ్వరిఁ జూడ మె వైరివీరదు
ర్దాంతభుజావిలాస మలరం దెగి పోరుల నస్త్రశస్త్రవి
క్రాంతిఁ గడంగువారి నని కన్నుల నిప్పులు
రాలు చుండఁగన్. 292

క. నాకొడుకు పోటుమాటలు,
నీ కేటికిఁ బొసఁగ నాడ నేగవు హాస్యో
ద్రేకమునఁ బలుకు చుండుట,
మాకు సహింపంగరాదు మానుము విప్రా. 293

క. అనినం జలమునఁ గుంతీ,
తనయాగ్రజుఁ డిట్లు లనియె దరహాసం బా
ననమున ముసుఁగువడఁగ న,
జ్జననాయకుతోఁడ ని ట్లశంకితభంగిన్. 294

ఉ. ఆహవకేళి వేడుక బృహన్నలచిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహమునోర్చి నీవసులనొక్కఁడుదక్కకయుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గా వలయుఁ దప్పదు నాపలు కట్ల
చూడుమీ. 295

క. అని యంతట నిలువక య
మ్మనుజేశ్వరు మొగముఁ జూచి మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం,
బనుపు బృహన్నల జయంబుభవ్యవిచారా. 296

విరాటుండు కంకుని సారెగొని వ్రేయుట.

ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ,
బడగ యెత్తునురగపాలు రేఖ
నెనయు చేతిసారెగొని వ్రేసెఁ బతి పేడి,
గడనయుడుగు మన్న నుడుగ వనుచు. 297

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురని
హృదయంబుతోడం బాంచాలిదెసం జూడ్కి మలఁగ
నూరకుండె నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేటు
గంటిం దొరఁగురుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన

రొమొత్తియుచ్చేరువ నున్న కనకకలశంబుజలంబులం గర
తలంబు దడిపికొని తుడుచునప్పుడు మత్స్యమహీవల్ల
భుం డీశోణితంబు పై చీరం బట్టుటకుఁ గతం బేమి యని
తన్నడిగిన నతని కి ట్లనియె. 298

తే. విమల వంశంబునను బుణ్య వృత్తమునను,
వఱలునీతనిర క్తంబు వసుమతీశ
ధరణిపై నెన్ని బిందువుల్ దొరఁగె నన్ని,
వర్ష ములుగల్గు నిం దనావర్ష భయము. 299

వ. అని చెప్పి యుత్తమ ద్విజలోహితపాతం బెట్లునుం గీడు
గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్భంగిం
జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం
దొరఁగం దుడుచు చుండె నంత నట యుత్తరు నెదు
రొక్కనం బోయి. 300

క. మంగళతూర్య రవములు సె,
లంగఁగ మాక్తికవిమిశ్ర లలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు,
ణ్యాంగనలును భద్రవాక్చయంబులతోడన్. 301

ఉ. అత్తఱిఁ గన్యకాజనసహస్రముఁ దానును జేరి వేడ్కమై
నుత్తర చందనార్ద్రకుసుమోత్కరమున్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు దండడి చల్లెఁ గిరీటిమీఁద న
య్యుత్తరుపైఁ బ్రమోదకలనోత్కటసంభ్రమసంభృ
తంబుగన్. 302

ఉ. తక్కటివారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచున్
మ్రొక్కుచు నాదటం దనదుమోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్రుఁ డ
య్యెక్కుడుమాట కోరువక యి ట్లను నర్గా జనంబుతోఁ
దగన్. 303

చ. కురుబలమున్ జయించుటయు గోవులఁ దెచ్చుటయున్ బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన చూవె నిజం బిది నాక యేల యె
వ్వారికిని నెవ్వరిం గెలువ వచ్చున యిట్టిసహాయసంపదం
బొరయక యున్న మీ కెఱుఁగఁబోలు నె నా బ్రదు
కెట్టిభంగియో. 304

వ. అని సారథ్యప్రశంసా ప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుం జనుదెంచి రాజమందిరద్వారంబుఁ జేరు నవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెఱంగు విన్నవించిన నారథికసారథులం జూచువేడ్కం మనంబు వేగిరపెట్టెడు నయ్యురువుర నియ్యెడకుం జయ్యనఁ దోడితె మ్మనువిభుని పలుకులు విని ధర్మతనయుండు పణిహారితో నల్లన యి ట్లనియె. 305

క. ఇన్నుత్తరు గనుఁగొనిన బృ,
హన్నల గోపించు నన్ను నతిభక్తిమెయిన్
మన్ని[illegible] గాన రాజా,
[illegible]ంప కేమి దప్పుఁ దలఁచునో. 306

వ. ఇది తెస్సగాఁ దుడుచునంతకుఁ దదీయప్రవేశం బించుక
వడి వారింపుము పదంపడి రా నిత్తు గాని యంతకు
నుత్తరుం డొక్కరుండు వచ్చునట్లుగాఁ జేయుము. 307

క. అని చెప్పి హర్షసంభ్రమ,
మున నజ్జననాయకుండు మునుఁగుట నది యే
మని యడుగఁ దలంపమిఁ దన,
కను వై కార్యము ఘటించి యతనిం బుచ్చెన్. 308

చ. అతఁడును బాగ్గ నిల్చి వినయంబున నుత్తరుఁ దోడి తెచ్చినం
బితృచరణాంబుజంబులకుఁ బ్రీతి మెయిం బ్రణమిల్లె నాతఁడా
పతియును జిక్కఁ జేర్చి గరుపాఱెడు మేనును హర్షబాష్పసం
ప్లుత మగునాననంబు నయి పుత్త్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు
గాఁగిటన్. 309

వ. ఇవ్విధంబున నాలింగితుండయి భూమింజయుండు పునః
పునఃప్రణామంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవం
బుగా నమస్కరించి మొగంబుగంటి సూచి యిది యేమి
యని యడిగిన. 310

క. ఏ నీవిజయము వొగడఁగఁ,
దా నప్పుడు పేడిఁ బొగడెఁ దానం గోపం
బూనిన సైరింపక నా,
చే నడిచితి సారె గొని విశృంఖలవృత్తిన్. 311

క. అని పతి పలికిన విని నె,
మ్మనమున భయసంభ్రమములు మల్లడిగొన న

మ్మనుజేంద్రనందనుం డి,
ట్లను నత్యాదరము మెఱయ నాతనితోడన్. 312

తే. తప్పు సేసితి రిట్టులు దగునె వీర,
లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము
కైకొనవలయుఁ గా కిట్లు గాదు గూడ,
దని నిషేధించు టొప్పునె మనుజనాథ. 313

వ. అని మఱియును. 314

క. సవినయముగఁ బ్రార్థింపుడు,
పవిత్ర చారిత్రులైన పరమద్విజు లి
ట్లవమతులై కోపించిన,
నవనీశుల కేల కల్గు నాయువు సిరియున్. 315

వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడికొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడు సెరుపువాఁడు గాఁడిది యొక్క ప్రొద్దుకీడున నయ్యెం గాని యని తాను రాజు దెసఁ బ్రసన్నుం డగుట దెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన నమ్మహీవల్లభుండు సంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచిననయాబృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యి ట్లనియె. 316.

విరాటుఁ డుత్తరని సమరప్రకారం బడుగుట.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడుం బసు
ద్రాణపరాయణత్వమున దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియఁ బార్థివుఁడున్ వెను దన్ని చూడ న
క్షీణజవంబునం గవియుసేనకు మాఱ్కొన నగ్గలించితే 317

ఉ. బాసట లేదు క్రొవ్వడర బంటుతనంబునఁ దాఁకి తేనియుం
బాసినచోట వాయఁ బెఱపట్టులపేరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొకమోహార మమ్మల మగ్గనేని నా
సాసుల నొక్కరుండ యనునాగ్రహావృత్తి బలంబు పైఁ
బడున్. 318

ఆ. ఒకఁడు పరశురాము నోర్చినవాఁ డొక్క,
రుండు ధనువునకు గురుండు దాన
హరువరమునఁ బుట్టి యక్షీణబలవిక్ర,
మముల నొక్కఁ డొప్పు మాఱు లేక. 319

ఉ. తక్కటివారలున్ సురలు దైత్యుల నైనను బోర గెల్చువా
రక్కురుసేన మేటిమగ లాధృతరాష్ట్రతనూజు లాజి నొ
క్కొక్కఁడ ధాత్రియంతయును నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ
వెక్కటి దాఁకి నొవ్వకయు నెమ్మెయి గెల్చితి నాకుఁ
జెప్పుమా. 320

ఉ. గోవుల నెట్టు లాఁగితి వకుంఠితవిక్రముఁడైన రాజరా
జేవిధి మానభంగమున కెల్లను నోర్చి పలాయమానుఁడై

నీవిజయంబు సైఁచి ఘననిందకు నియ్యకొనంగఁ జాలెఁ బు
త్రా వెఱఁ గయ్యెడున్ రణవిధం బఖిలంబు నెఱుంగఁ
జెప్పుమా. 321

చ. అనవుడు నాతఁ డి ట్లనియె నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మనదైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాగ నర్హ మగుచందమువాఁడు మహాత్ముఁ
డొక్కరుం
డని నను గాచెఁ గౌరవులనందఱ గెల్చి మరల్చె గోవులన్ 322.

వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 323

తే. ధూళిపెల్లుగ నెగయంగ నేల గోడి,
వడఁగఁ జనుమూఁకఁ గని వడవడ వడంకి
పాఱు తేరంగ నమ్మహాభాగుఁ డప్పు,
డోడ కోడకు మని నన్నుఁ గూడ వచ్చి. 324

వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే
నతనియాజ్ఞకు మిగుల కుండితి. 325

ఉ. కౌరవసేన గోగణముఁ గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానకయుపాంతమునం దొలఁగించి వేగ నా
తే రట దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబుదు
ర్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెల్చె
నార్చుచున్. 326

ఆ. చెదరకుండఁ బసులఁ బొదివి యుంచుక మేర,
యిక్కడకుగు దెంచి యొలమి మగిడి
కడచి పోవుచున్న కౌరవపతి ముట్టి,
వడరివంత సేన లతనిఁ గూడె 327

మ. కురురాజున్ సబలంబుగాఁ గవిసినన్ ఘోరాహవంబయ్యె నం
దరదంబుల్ నుఱుమయ్యె నశ్వములు నుగ్గయ్యెం గరి
వ్రాతముల్
ధరదంతంబులయూఁతగా నొఱగె నుద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం దద్బాణ
పాతంబులన్. 328

వ. ఇది యమ్మహాపురుషుచేసినవిధం బనిన విని యచ్చెరు
వంది విరాటుండు. 329

ఆ. ఆతఁ డెవ్వఁడొక్కొ యమ్మహాత్మునిఁ గనుం,
గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప
నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తిసం,
యుక్తి నెపుడుఁ గొలిచి యుండ వలయు. 330

క. ఎచ్చోటు నున్నవాఁ డతఁ,
డిచ్చోటికి నేల రాఁడొ యిప్పు డనుడుఁ దా
నచ్చట నంతర్హితుఁ డై,
యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటియెల్లిటిలోనన్. 331

ఉ. దేవకుమారకుండ యగుఁ దేజము చందముసూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడినయంతియ కాదు నాకు సం
భావన సేయువత్సలతభంగులఁ దా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు గల్గుట దేౘముసేసె
నెంతయున్. 332

వ. అని చెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం
జేసె నట్టిసమయంబునఁ గౌంతేయాగ్రజుండు ముఖ

ప్రాంతంబు పైచీరచెఱంగునం బొదివికొని ధనంజయునిఁ జక్కం జూడక యుండె విరాటుండు గిరీటి పరాక్రమంబు క్రమంబున నిట్లు దనతనయునివలన వినియునుం దెలియక యెప్పటి నపుంసకత్వబుద్ధితోడన సంభావించి పోవం బనిచిన బృహన్నలయును జతురంబుగాఁ బలికి తిదియ తెలుపు తెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింపకుండునదియని వైరాటితో నల్లన చెప్పుచుం జనియె నజ్ఞననాయకుండును గంకునిం బొమ్మని యుచిత పరివారవృతుం డయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుదేష్ణాసందర్శనసమాచరణంబు నడపి యతం డడుగఁ ద్రిగర్తపతినోర్చిన తెఱం గెఱిం గించె నట నయుండు నాట్యశాలకుం బోయి. 333

అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగా గురువీరులశిరోంబరంబు లిచ్చుట.

తే. చెలులు దానును నుత్తర యెలమిఁ దన్నుఁ
గాంచుటయుఁ బ్రీతి యెసలార గారవించి
బొమ్మపొత్తిక లడిగితి కొమ్మ యింద
మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చినయంబరములు. 334

వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జనభోజనంబులు సలిపి ధర్మతనయునివాసంబునం దేకాంతస్థలంబునఁ దా రేవురును ద్రౌపదియును గూడఁబడునట్టి తెఱంగు సంఘటించి సమాగమనసము చితప్రకారంబు నడపి గోగ్రహనివర్తనంబును రణప్రవర్త

నంబును నన్యోన్యవిదితం బైనయనంతరంబ యగ్రజు
నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కి ట్లనియె. 335

క. మొగ మొప్పదు నాదెస నీ,
జగతీనాథునకు నే విచారించియునుం
దగ దీనికిఁ గారణ మిది,
యగు నని యేర్పఱుప నేర నయ్యెద నెట్లు న్. 336

వ. అనిన నిని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 337

క. ఒం డేమియు లేదు వీరా,
టుం డాత్మతనూజుఁ బొగడుడును దుర్దమదో
ర్దండత గల్గుబృహన్నల,
యుండఁ గొఱఁత యేమి పగఱ నోర్చుట కంటిన్. 338

ఆ. అనినఁ బేడిఁ బొగడె దని యవివేకి యై,
కోప మడర సారె గొని యతండు
వ్రేసె నెత్తు రపుడు వెడలఁ బోయినఁ జీరఁ,
గప్పికొంటి నీవు గాన కుండ. 339

క. అని చెప్పి గంటి సూపిన,
ననిలతనూభవుఁడు గనలి యాదుష్టాత్ముం
దనయాదిబంధుయుతముగ,
నసిచెద జమ్ముపోలి కనియె నంగము వొంగన్ 340

వ. కిరీటియుం గోపించి. 341

క. తనకొలఁది యెఱుంగనియి,
మ్మనుజాధము నిపుడ పట్టి మర్దింపక త

క్కినఁ గాదు వీనిరాజ్యము,
నిను నంతయుఁ జేరఁ గా కనియె ధర్మజుతోన్. 342

చ. అనవుడు నాతఁడిట్టులను నక్కటయింతకుముందరేమియున్
మనలనెఱుంగఁ డవ్విభునిమాటునఁబూనిక దీర్చికొంటిమా
తనికొక యెగ్గు సేఁత యుచితంబె యెఱింగెడునల్లుగాఁగఁబో
యినఁ గనియున్ దురుద్ధతి వహించినఁ జూతముగాక
పిమ్మటన్. 343

వ. అని పలికి వారల కందు మాన్పి యిది యట్ల కాక
యెండు దగునే యనుచుఁ దక్కినవారిదెసయుం గనుం
గొనిన నెల్లవారు నుపశమించిరి తదనంతరంబ తమ్ము
నెఱింగించు తెఱంగు దలపోసి తా రందఱు విరాటు
కొలువుకూటంబునకుం బోయి బయలుమెఱసి యుండు
వారుగా నిశ్చయించి యారాత్రి గడపి వేగుటయుం
గృతిస్నాను లయి పాండుసూనులు సమయవిహితా
చారంబులు నడపి యుచితప్రకారంబున. 344

క. తెలుపు లగుచీరలను బూఁ,
తలఁ బువ్వుల నొప్పి రాజతనయానుగుణో
జ్జ్వలమానసీయవేషము,
లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్. 345

క. చని ధర్మసుతుఁడు సింహా,
సనమున భీమాదు లాత్మసముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి,
కొని పంచాగ్నులనుబోలెఁ గూర్చున్నంతన్. 346

తే. వేడ్కఁదోడి పూసి కట్టి యవ్వీరటుఁ డుత్త,
రుండు ద్రోణజనుఁ జేరఁ గొల్చుండుబుద్ధి-
నచటి కేతెంచి కని విస్మయంబు నొంది,
యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టు లనియె. 347

క. ఇది యేమి కంక నీ వు,
న్మదవృత్తిని శంక దక్కి నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి,
వదియును గా కిపుడు డిగ వహంకారమునన్. 348

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం
డతని కిట్లనియె. 349

సీ. నడదివియలు సేసె నగరికి మాణిక్య
మకుటముల్ పూనినమనుజపతులఁ
దగునాజ్ఞ నూయాణముగ నొనరించె మం
చిగ నేలనాలుగుసెఱఁగులకును
బ్రీతార్థిజనుల సచేతనత్యాగధ్వ
జములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కులన్నింటను దెలుపారుపూఁత గా
వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు

తే. రాజసూయాధ్వర ప్రవర్తకుఁడు నిత్య,
సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ,
రాజు సుమ్ము మత్స్యావనీరమణ యితఁడు 350

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు
ద్ద్యోతితమూర్తి గౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీబిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. 351

అర్జునుఁడు విరాటునకుఁ ద న్నెఱింగించుట

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబునం
బెనంగొన నితండు ధర్మతనయుండ యేని భీమార్జున
నకులసహదేవులుం బాంచాలియు వేరి యని యడిగినఁ
గవ్వడి యి ట్లనియె. 352

చ. వలలుఁ డనంగ నీనగరవంటలవాఁ డయి నిల్చి వేడ్కకుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి పోరఁగఁ బంచినఁ బోరు జెట్టిమ
ల్లుల విఱుచుంగడంగి ప్రబలుండనఁగా జరియించుచుండు వి
చ్చలవిడి భీముఁ డీతఁ డవిషహ్యపరాక్రమదుర్దముం
డనన్. 353

తే. బకమహాసురు నిర్జించి బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరు పేరడంచి
వనము నిష్కంటకము సేసె ఘను హిడింబుఁ
గూల్చి యాతని చెలియలిఁ గొనియె నితఁడు. 354

క. నీమెచ్చువారువంబులఁ,
దా మచ్చిగ నరయు నిత్యతాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక,
నామము ధరియించె నితఁడు నకులుం డధిపా. 355

క. శత్రునృపకాలకూటము,
మిత్రామృతవృష్టి బుధసమీహిత సిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి,
పాత్ర మితఁడు మాద్రితోలుతపట్టి నరేంద్రా 356

క. నీపాలికి వచ్చి నిఖిల,
గోపాలకముఖ్యవృత్తిఁ గొలువు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య,
క్ష్మాపాలక మెలఁగు వీఁడె సహదేవుండున్. 357

క. సుకుమారమానసుఁడు గాం,
తికిఁ బ్రాణము ప్రాణ మితఁడు తేజోగణ్యుం
డకుటిలుఁడుఁ రాజనీతి,
ప్రకారసంవేది వంశ పావనుఁడు నృపా. 358

వ. అని యిట్లు ధర్మజభీమనకుల సహదేవులం గ్రమంబునం
జూపి చెప్పి మఱియు ని ట్లనియె. 359

క. విను సైరంధ్రీవేషం,
బున మాలిని యనఁగఁ బరఁగి పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం,
దనకడ మెలఁగుసతి ద్రుపదతనయ మహీశా. 360

క. ఆచపలాక్షికిఁగా మన,
కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహ
స్యోచితవిధమున గంధ,
ర్వాచరణము పేర భీముఁ డతిభీమముగాన్. 361

విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట.

వ. అనియె నప్పుడు వృకోదరుండు. 362

సీ. వండరూపమునఁ బ్రచ్ఛన్నుఁ డై వచ్చి క
న్నియలకు నెల్లను నృత్తగీత
వాద్యనైపుణ మనవద్యశిక్షావిధి
నలవరించుచు బృహన్నల యనంగఁ
బరఁగునీతండు బీభత్సుఁడు సు మ్మని
చూపి యమ్మత్స్యరాజునకుఁ జెప్పి
వెండియుఁ బలుకు నాఖండలు నోడించి
ఖాండవ మేర్చె నాతండు దన్ను

తే. గారవించిన నెక్కటి కాలకేయ,
వర్గములఁ బరిమార్చె నివాతకవచ
సంఘములనోర్చెగంధర్వసమితి గెలిచి,
ధార్తరాష్ట్రిగజునిచెఱఁదలిఁగె నితఁడు. 363

వ. అన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం
గలుగుసందేహావేశంబు వినయసంభ్రమంబుల నిగుడ నీ
కునికిం జేసి చిక్కుపడి యున్ననిజజనకునకు 'నర్జునుం
జూపి యుత్తరుం డి ట్లనియె. 364

తే. ఈతఁ డింతకు మీకుఁ ద న్నెఱుఁగఁ జెప్ప
వలవ దని నియమించినఁ దెలియఁ బలుక
నలికి యొక దేవసన్నిభుం డంటిఁ గాని
నిన్న నంత[illegible] నిక్కువంబు. 365

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెడు రెండవనన్ను నెట్ట కే
లకుఁ దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు సూడదా
నికి మది శంకలేమి మహనీయపరాక్రముఁ డైనయాకిరీ
టికిఁ జనుఁ గాక యివ్విధము డెప్పర మన్యుల
కోర్వ వచ్చునే. 366

చ. తము నెఱిఁగించి యల్ల నుచితప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ జొన్ప నేను బ్రమదంబున నప్పటికియ్యకొంటి లో
కము సమరంబులట్ల యని కయ్యముతీవ్రతకుం దగంగ ర
థ్యములఁ జరింపఁ జేఁత భర మై తుదిఁ బల్మఱు
నోహటించితిన్. 367

క. మొగ మోడఁ డితఁడు గౌరవ,
జగతీశుఁడు విఱిగినపుడు జవమున వెనుకం
దగిలి యిది జూద మాడఁగ,
నగునెడగా దఱుమ వలయు ననియె నతనితోన్. 368

ఆ. అనిన నతఁడు వెఱపు నత్యాదరంబును,
సంతసంబు మానసమున బెరయ
నవయవముల సంభ్రమావేశ మేర్పడ,
గారవమున విజయుఁ గౌఁగిలించె. 369

క. విస్మయంబు మిగులఁ గుంతీ,
తనయాగ్రజుపాదపీఠతలమున ఫాలం
బును బొందఁ జాఁగి మ్రొక్కి యు,
తనికౌఁగిలి వడసె సమ్మదము దళుకొత్తన్. 370

ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నా,
లింగనంబుసేసి యంగకములఁ

బులక లెగయఁ గేలు దల మోడ్చి ధర్మజు,
నాననమున దృష్టి యడర నిలిపె. 371

ఉ. అత్తఱి లేచి వచ్చి తనయన్నలఁ దమ్ములఁ గానిపించె స
య్యుత్తరు నర్జునుండు దగ వొందఁగ నప్పుడ పిల్వఁబంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్త్రిసచివోత్కరసోదరవర్గపుత్రకో
దాత్తభటాదియోగ్యుల ముదంబునఁ బాండవదర్శనార్థమై. 372

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగా ధర్మతనయసేవాతత్పరుం
డై తదనుమతి సముచితరుచిరాసనంబున నుండి
విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణ
కెఱింగింపం బనిచి పాంచాలిం దగిన తెఱంగున గార
వించునట్లు గావించె నట్టియెడ ధనంజయుం డతని
కి ట్లనియె. 373

తే. చాల దుస్తర మైనయజ్ఞాతవాస,
వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త,
వృత్తి నేము నిర్భయుల మై విందులట్లు. 374

వ. అనిన విని విరాటుం డతని కి ట్లనియె. 375

ఉ. ఏనన వేఱ యొక్కఁడనె యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశవాసములఁ గాఱియ లోర్చి యడంగి యుండి మీ
వూనిక దీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా
మానదయాసమృద్ధి నను నొందుట గాదె
సురేంద్ర నందనా. 376

వ. అని పలికి ధర్మనందనుం జూచి. 377

ప. ధరణియుఁ బట్టణంబు హయదంతిరథంబులుగోవులుగ్ భటో
త్కరము నమాత్యవర్గమును గాఁగలరాజ్యమితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్రులును బంధులుఁ దమ్ములుఁ
గొల్చి యుండెదం
గరిపురికేత్తునట్టిపని గల్గిన నోపిన యంత సేసెదన్. 378

చ. అన విని యుత్తరుండు దగ నజ్జనపాలకుఁ జూడ ని ట్లను
న్మనకొకరాజ్యముంగలదె నన్నును నిన్నును నిన్న మొన్న పీ
రనితరసాధ్యశత్రువిజయంబునఁ గాచినయప్డు గల్గఁ జే
సినయది దక్కఁ దాని మఱిసెప్పఁగ నేటికి నింతవింతఁగన్ 379

వ. అది సిద్ధం బట్ల చెల్లుం గాక యించుక విశేషంబు గలదు
వినుము. 380

చ. సవినయవృత్తిఁ గొల్వ మిట చన్నదినంబుల వీరు నీఱు పైఁ
గవిసిననిప్పులట్ల యధికం బగు తేజము దోఁప కున్కి న
ట్టివిధముసాపరాధతను డెందము లూఱటఁ బొందియుండ నే
రవు మన కట్లు గాన తగఁ బ్రార్థన సేయుట
యుక్త మిత్తఱిన్. 381

వ. అదియునుం గాక. 382

క. ధనవర్గంబులు వీ రి,
చ్చినయవి య ట్లగుట వేడ్క సేయవు తగ నూ
తన మగుకానిక యీవల,
యును వే తో డ్తేరఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్. 383

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర
మంత్రులమొగంబు సూచి కుమారిక నలంకరించుకొని

తెం డని నియోగించిన వారును ప్రియంబునం జని
తత్కార్యశ్రవణసంప్రీత యగుసుదేష్ణయనుమతంబున. 384

క. పదనికి రాఁ బులు గడిగిన,
సుదనాస్త్రము రేఖ గలిగి మానిని మెయి సె
న్నొదవఁ గయిసేసి రప్పుడు,
ముదితాజనములు ప్రమోదమున లలితముగన్. 385

విరాటునిమంత్రు లుత్తరను బాండవులయొద్దకుఁ గొనితెచ్చుట.

వ. ఇట్లు శృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫల
ప్రాలంబమాలికలతోడిగొడుగులు వట్టించి యత్యాద
రంబున నయ్యమాత్యులు దోడ్తేర ధారాధరనికర
మనోహర యగుపర్జన్యలక్ష్మియుంబోలె వచ్చుచున్నం
గని విరాటుం డెదురువోయి పురోహితులును బంధు
జనంబులుం దానునుం బొదివికొని పాండవాగ్రజునగ్ర
భాగంబునకుం దెచ్చి యచ్చెలువనిలిపి సపరివారంబుగా
దండప్రణామంబు సేసి చేతులు మొగిడ్చి యిట్లనియె. 386

క. ఎఱుఁగమి చీఁకటి నీ పె,
ద్దఱికంబు దలంప నేమితప్పు గలిగినన్
మఱచి దయఁ జూడు మిట్లం,
దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్. 387

వ. అని నిజానుజతనూజులం జూపి మఱియును. 388

క. ఇమ్ముద్దియ యర్జునునకు
ని [illegible] బంధుజనుల కిందఱకుఁ గడున్,

సమ్మత మెల్లప్రజకు నే.
నిమ్మాయి నినుఁ జేరి బ్రతుకు టిష్టం బధిపా. 389

క. అని పలికిన విని కుంతీ,
తనయాగ్రజుఁ డింద్రసుతునదన మాలోకిం
చిన నాతఁ డిట్లు లను నన,
మ్మనుజేంద్రుఁడు వినుచు నుండ మత్స్యాధిపుతోన్. 390

క. ఈకన్నియఁ గోడలిఁగాఁ,
గైకొనియెదఁ గాని యిది దగ దుచితవృత్తిన్.
నాకడన నబల మెలఁగుట,
లోకము శంకించు నన్ను లోలాత్మునిఁగాన్. 391

వ. అదియునుంగాక నృత్తగీతాదులయెడ శిష్యురాలికి
గురుండ నైన నాకు నివ్విధంబు ధర్మంబు గాదు గావున. 392

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళాదక్షుం డుదారుండు గా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యుగ్రతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీసరోజాననన్. 393

వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంతసంతుష్టాంత
రంగుండై. 394

తే. అర్జునునివియ్య మనియెడునంతకంటెఁ,
గడపఁ బెంపు నా కెయ్యది కార్యనిశ్చ
యంబు ధర్మతనూభవుం డానతిచ్చు,
వాఁడు మన మెల్లఁగావించువార మదియు. 395

ఆ. అనుడు నతనికిట్టు లనుఁ బాండవాగ్రజుం,
డింద్ర తనయుఁ డుచిత మెఱిఁగి పలికె
నిట్లు సేయువార మిప్పుడు నుట్టాల,
కెల్లఁ జెప్పి పుచ్చుఁ డీశుభంబు.



# టీకా తాత్పర్యములు



1. వైశంపాయనుడు వ్యాసమహర్షి శిష్యుడు. జనమేజయుడు అర్జునుని ప్రపౌత్రుడు. నీతికోవిదులైన ఋషిపుంగవులు ప్రజాపాలనతత్పరులైన రాజులకు ధర్మతత్త్వముల నెఱిగించు ఆచారమున్నది. ఇచ్చట కథకుడు మునిసత్తముడైన వైశంపాయనుడు. శ్రోతసర్పయాగములో లగ్నమనస్కుడైన మహారాజుజనమేజయుడు, వైశంపాయనుడుజనమేజయునకు చెప్పినకథగా భారతము చెప్పబడినది. ఇట్లీ కథ చెప్పుటకు సామాన్య ప్రయోజనము ధర్మార్థ కామమోక్షములందలి సూక్ష్మతత్త్వములను లోకవృత్తపరముగ చూపుట, తద్ద్వారమున మానవులకు ఐహికాముష్మిక సుఖము లనుభవింప వీలగు మార్గముల సులభ మొనర్చుట. విశేష ప్రయోజనము జనమేజయునిచే జరుగుచున్న సర్పయాగమును మాన్పి నాగజాతిని అగ్నిదగ్ధము కాకుండ కాపాడుట.

ప్రస్తుత కథాంశము కౌరవులు మత్స్య నగరమునకు కొలది దూరమున ఉత్తర దిశగానున్న విరటుని పశుగణములం బట్టుకొని విజృంభించుటతో ప్రారంభమగుచున్నది.

2. ప్రబలదోర్బల లీలా ధుర్యగతి = ప్రబలమైన బాహుబల విలాసమును వహించు గతితో

3. పొదివె = క్రమ్మకొనె, ముక్కడిమూకలు = క్షుద్ర సైన్యములు లేక అల్పమైన గుంపులు, శర+ఆసారము = బాణ వర్షము, భూమింజయుడు = ఉత్తరుడు

4. తేరున్+పూన్ప = రథమునాయత్తపరుప, తనుత్రాణము = కవచము, తూణము = అమ్ములపొది, తోమరము = బల్లెములు

6. ఈడుగఁజేయుము = సరిపడునట్లుచేయుము

7. అగ్గించుట = పొగడుట ముడివడుచుండన్ = పెనుగొనుచుండగా

8. ఎత్తునఁగొందు = దాడిలో కైవసము చేసుకొందును
మారొ్కనుట = ఎదుర్కొనుట, డీకొనుట
కడపు = త్రోలు

9. దొరకొనిన = లభించిన, కదుపులు = పశువులమంద

10. కిట్టి = సమీపించి

11. ఉనికిన్—చేసి = ఉండుటవలన

12. స—అమర్ష — ఆపహాస తరళ హృదయురాలై = కోపము, అసహ్యముచేచలించుచున్న హృదయముగలదియై

13. బృహన్నల = పేడి (అర్జునుడు). అర్జునుడొకానొకప్పుడు స్వర్గలోకమునకుఁబోఁగా దేవేంద్రుడాతని సపర్యకై ఊర్వశిని పంపెను. ఊర్వశి అర్జునియందు మోహముగొనినదై తన కామతృష్ణను తీర్చవలసిన యడుగును. కాని అర్జునుడు మాతృభావమున ఆమెను నిరాకరించును. ఊర్వశి కోపించి పేడివి గమ్మనియు స్త్రీలకు సిగ్గువిడిచిన నృత్య గీతాలు నేర్పుమనియు శపించును. ఆ [illegible] తరువాతి

దేవేంద్రుడు అజ్ఞాతవాససమయమున అర్జునునకుపయోగ
పడునట్లుగా ననుగ్రహించును.

రథంబుగడపన్+తానరైయుండు = రథము తోలుటలో
తనకుతానే సాటిరైయుండును.

14. క్రీడి = (కిరీటికి వికృతి) అర్జునుడు, అనిన్ = యుద్ధములో,
    నడి+చన్న+ఏడ్తెఱ = అనింద్యమైన పరాక్రమము

15. వెరవు = ఉపాయము, లావు =బలము, ఉవిద = స్త్రీ

16. పాంచాలి = పాంచాల దేశమునకు చెందినది, ద్రౌపది

17. అలిగొనుట=అపహాసించుట, వేళాకోళముగా తీసుకొనుట

19. బిట్టు+అఱన్ = వేగము చెడిపోవునట్లుగా

20. సైరంధ్రి = అంతఃపురములో గంధమాల్యాదుల కూర్చు
    టకై నియోగింప బడిన పనికత్తె, ఇచ్చట ద్రౌపది.

21. పెంపుదప్పునే = ఔన్నత్యము తొలగునా!

23. ఉరియాడుట = ఊగులాడుట, చలించుట

25. నెలకట్టు = రాతికట్టడపు నేల, కుట్టిమము వెడ్రవాలింపన్ =
    కొంచెము వ్రాలజేయగా, అసదు+కౌను+తీఁగె = సన్నని
    నడుము అనెడి తీగె. ప్రభాడోలనము = కాంతితూగు,
    అందియల మొరపము =అందెల సవ్వడి

26. నెమ్మి = ప్రేమ

27. అచ్చుపఱుపడు = ఏర్పాటుచేయడు

28. కూయి = మొఱ, ఆర్తధ్వని, రక్షణ: కండువ = సామ
    ర్థ్యము పూనివచ్చితి = పూనికతో వచ్చితిని, ఇయ్యకొని =
    అంగీకరించి, ఇట్లాడంబడక తక్కుట = ఇట్లు అంగీకరించ
    కుండకనుండుట

29. వెఱతు = జంకుదును
30. తివిరి = కోరి, ప్రయత్నించి
31. శుండాలము = ఏనుగు (తొండము గలది) నడతెంచు = నడచివచ్చు
32. కడఁగి = పూని, ప్రయత్నించి
33. వేరమ్ము = వేగముగా రమ్ము, మైమఱువు = కవచము
35. వైరాటి = విరటుని కొడుకు, ఉత్తరుడు
36. ఏర్పాటు = చక్కజేయుట
ఆఖండలసూతి = ఇంద్రుని కుమారుడు అర్జునుడు
37. వెఱచినట్టి తెఱంగు భావించి = భయమందినట్లుగా తనను అగపరచి.
తేరఁగా పనిచె = తెప్పింప బంపెను.
38. ఒఱపలుగా = వ్యత్యస్తముగా, ఎగుడుదిగుడుగా.
39. కంకటము = కవచము. చిడిముడి పడగన్ = తొట్రుపడగ.
41. సిడము = ధ్వజము.
42. కడిమి = అతిశయము.
44. జవన + అశ్వములు = వేగముగా పోవుగుఱ్ఱములు.
45. మెఱసిన = బయల్పడిన.
46. తత్ + అంబరములలో = వారి వస్త్రములలో.
తరము + ఎఱిగి = గణ్యత తెలిసికొని, సామ్యములు తెలిసికొని.
48. నొగ = బండితొట్టె, ముక్కు = చిక్కు, వల్గత్ + అశ్వము + అగు = వేగముగా విడిచిన గుఱ్ఱములుగలది

అగు (గెలుపు విడిచిన), పరేతనిలయము = భూతము లుండునది, శ్మశానము.

49. అభినవ – జలధర – శ్యామంబులగు = క్రొత్తమేఘముల వలె నల్లనివగు, క్రేణిసేయు = అవహేళన చేయు. హారిద్రరుచి = పచ్చని కాంతి, నలిన్ = యోగ్యముగా, కాఁపువోయెడు తెఱఁగుదాల్ప = కాపురము చేయబోవు నట్లు కనుపట్టగా, నేల గోడివడగ = నేల అణగిపోగా.

50. చిచ్చువడిన చూపు = చేష్టలు దక్కిన చూపు

51. భీష్మ–ద్రోణ–కృప–ఆది–ధన్వి–నికర–ఆభీలము = భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు మున్నగు విలుకాండ్ర సముదాయముతో భయంకరమైనది. దుర్యోధన – గ్రీష్మ – ఆదిత్య – పటు – ప్రతాప – విసర – ఆకర్ణము = దుర్యోధనుడను గీష్మ సూర్యుని దృఢశౌర్య ప్రసారముతో కూడుకొన్నది. శస్త్ర – అస్త్ర – జాల–ఊష్మ–స్ఫార = శస్త్రాస్త్రసముదాయముల తాపాధిక్యముగలిగిన, చతుర్విధ–ఉజ్జ్వల – బల – అతి – ఉగ్రంబు = చతురంగబలములతో భీషణమైనది. ఉదగ్ర – ధ్వజ – అర్చిష్మత్త్వ – ఆకలితము = ఉగ్రములైన ధ్వజములను మంటలతో నొప్పుచున్నది.

52. అకృత + అస్త్రుడు = అస్త్రప్రయోగమున నైపుణ్యము లేనివాడు.

53. జెట్టిదులు = ఉద్ధతులు, కఠినులు.

55. శతమఖతనయుడు = దేవేంద్రుని పుత్రుడు, అర్జునుడు.

ఉ॥ కౌరవ సేనజూచి...

ఉత్తరుడు అర్జునునితో అనుచున్నాడు.

తా॥ కౌరవ సైన్యమును జూచిన నాకు హృదయము, శరీరము రెండును వడకుచున్నవి. నీవు పట్టించుకొనకుండా నన్ను నిర్లక్ష్యముచేసి వెళ్లుచున్నావు. ఇది మంచిది కాదు. ఇప్పుడు ఇచ్చట ఉన్న పరిస్థితిని చూచి కౌరవులను ఎదుర్కొనుట ఉచితము కాదని నిర్ణయించుకున్నాను. కాబట్టి. శీఘ్రముగా రథమును వెనుకకు మరల్పుము. ఓ బృహన్నలా! ప్రాణములు తీసిఅను ఆరోక్తి నీవువినలేదా!

56. ఆమిషము = మాంసము, భోగ్యవిషయము

57. కదంబము = సమూహము

58. ఎలుగువడక = సర్వము కంపింప; గద్గదస్వరముతో పసుల దయ్యమెఱుగు = పశువుల సంగతి దేవుడే ఎఱుగును, అనికిజాలనేను = యుద్ధమునకు నేనుచాలను; నాకు శక్తిలేదు

60. చ. తన భుజశక్తియున్...

తా॥ స్వీయ భుజ పరాక్రమమును, శత్రువుల బాహుదర్పమును కూడ లెస్సగా పరికించిన నీవు ఏవిధముగనూ మనస్సు తెమలక రణము విడిచి పోవుదమను కొనుచున్నావు. కాని ఇట్టిరీతిని ప్రపంచములో నేటి కొరకులు మెచ్చుకొనరు. [illegible] నీవంటి [illegible] జూడనూలేదు ఇంతకు నీకీ భయమేల కలుగుచున్నదో నాకు తెలియుటలేదు.

61. [illegible] = శిరఖము, అగ్గలికము = ఆధిక్యము, [illegible] బెగ్గడిలుట = విహ్వలించుట క్రందరు = [illegible] [illegible] వము, నెగడుట = [illegible]

63. వెడమాటలు = పనికిమాలిన మాటలు

64. పార్థుడు = పృథాకుమారుడు, అర్జునుడు

67. బంటుతనము = పోటరితనము, పోరాడు గుణము.

అగ్గించి = పొగడి

68. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁబట్టుము = కొంచెము ధైర్యము వహించుము.

69. వివ్వచ్ఛుడు = అర్జునుడు. (బీభత్సునకు వికృతి)

70. విఱిగిన = ఓడిన, ఆగకు = ఆపకు, క్రొవ్వాఱుగ దేనిఁ దలఁపడు = నీకు క్రొవ్వాఱుగక ఉన్నట్లయితే డీకొనుము.

72. యుగ్యములు = కాడిమోయునవి, అశ్వములు

73. గూఢ రూపరేఖాజ్ఞతలేమి = గుప్తముగా ఉన్న రూపు రేఖ తెలియకపోవుటచేత. గతిస్ఫురత్ + ఉదాత్తత = నడకలో గోచరించుచున్న హుందాతనము, ఊష్మ-

లత = గ్రీష్మమునందలి లత

తే॥ ఆడుచందంబు...

తా॥ కొంత స్త్రీరూపము, కొంత పురుష రూపము గలిగినది గ్రీష్మ కాలములోని లతికవలె (శుష్కత్వ స్నిగ్ధతాద్వైధ మిశ్రణముచేత), శోభించును. పేడిరూపమునందును వికృత వేషమును పొందకితడు నివురుగప్పిన నిప్పువలె అంత స్సత్వమును బయల్పరచుచున్నాడు.

75. ఒంటి = ఒంటరిగా.

76. ఆజి = యుద్ధము.

77. పరి = సైన్యము.

78. శుండాల - రయ - లీలా - సమరేఖంబగు = గజ గమనవేగ లావణ్యముతో సమానమగు, పురుహూత పుత్రుండు = ఇంద్రునిపుత్రుడు, అర్జునుడు, పదశతమాత్ర ప్రదేశపలాయితుండు = నూఱడుగుల దూరముమాత్రమే పరుగెత్తినవాడు, ఎయిది పట్టుకొనిన = వెన్నంటిపట్టుకొనిన.

79. పెలుకుఱు దీనదృష్టులు = భయవిహ్వలములైన దీనదృష్టులు, కీడ్పాటు = తగ్గుదల, హైన్యము, నిష్కము = బంగారునాణెము, మాడ, కరటిదశకము = పది యేనుగులు.

82. చిచ్చుఱపిడుగు = అగ్నితో నొప్పియున్న పిడుగు.

83. నడుకొన = కంపింప.

84. సవ్యసాచి = కుడి యెడమ రెండుహస్తములచేతను బాణములు వేయువాడు, అర్జునుడు, నిక్షిప్త + ఆయుధంబైన = భద్రపరుపబడిన ఆయుధములు గలిగిన, క్లీబ - రూప - ఛన్నుడు = నపుంసక రూపముతో దాగియున్నవాడు, ఉత్పాతము = ఉపద్రవము.

85. పటుమొయిళులు = గొప్పమేఘములు, అపధ్వనులై = వికృతస్వరములుగలవియై.

88. ఒఱపుగ = అందముగా, ఉపాయముగా, మొనలు = సైన్యములు, వ్యూహములు.

89. సమయ భంగము = ప్రతిజ్ఞా భంగము.
సన్నవాఱు = సన్నగిల్లు.

90. వెరవరి = ఉపాయశాలి.

92. నెఱప = నిర్వహింప.

93. పుయిలోట = సంకోచము.

94. మాతంగ - స్ఫూర్జిత - యూథ - దర్శన - సముత్థిత - క్రోధమై = ఏనుగులయొక్క గర్జించుసమూహమును చూచినందువల్ల అతిశయించిన క్రోధముగలదియై, ఓజ = క్రమము, విధము; సమర - క్షేమ- అభిరామ- ఆకృతిక = యుద్ధోచితమైనశరీరబలముతోనొప్పుచున్న ఆకారముతో.

95. ఆతతసేన = విశాలమైనసేన, గోవ్రాతనివర్తనంబు = గోసమూహమును మళ్లించుట

96. కుంభ సంభవుడు = కడవలో నుండి పుట్టిన వాడు, ద్రోణుడు.

97. నిన్ను + ఒండు + అనరామిజేసి = నిన్నుఏమీ అనలేక పోవుటవలన, దోః+చండిమ = బాహుబలేద్ధత్యము ఓహాటించు = వెనుదీయు

98. శిలీముఖము = బాణము, తుమ్మెద

101. వ్రేల్మిడిన్ = చిటికలో, త్రుటికాలములో

103. అరదము = రథము (వకువికృతి)

104. అన్నువలు = అల్పములు

106. కైదువు = ఆయుధము, అలవు = పరిశ్రమ, శ్రమ

111. ముగ్ధుడు = అమాయకుడు

118. ఉపలక్షించి = నిర్దేశపరచి, నిరూపించి

119. ఏడుగడ = రక్షకమైనది

122. కౌంతేయులు = కుంతీపుత్రులు, పాండవులు

124. శత్రు–క్ష్మానాయక–గర్వ–తమః–భానులు = శత్రు రాజులు గర్వమును చీకటిని పారద్రోలుటలో సూర్యుని వంటివారలు.

126. కాటియ = సంకటము, ఇక్కట్టు. కాపురుషులు = కుత్సిత పురుషులు

129. బాస = ప్రతిజ్ఞ, వాగ్దానము. తారు = వారు

132. సర్వాంగ – సంగత–ఉర్వీతలంబగు = సర్వావయవ ములు భూమికి తాకునట్టిదియగు

137. అనిమొన = రణాగ్రమున

138. అనిశము = నిత్యము

140. నినున్ + అశ్వవ్రాతముం జోకక గాలియురానీను = నిన్నును నీ అశ్వసమూహమును సోకు గాలిని కూడ రానీయను.

142. కిల్బిషములు = పాపములు, షండభావము = నపుంస కత్వము, పుంస్త్వాభరణా = పురుషత్వమే ఆభరణ ముగా గలవాడా!

143. ఏక–హాయన – పరిపాలనీయము = ఒక సంవత్సర కాలము ఆదరింపదగినది

145. భవత్– బాహు–వప్ర–గుప్తి–బలుపు = నీయొక్క బాహువులను కోటలో దాగుటవలన కలిగినదార్ఢ్యము.

146 పుంఖము = పింజ

147. ఉష్ణీషము = శిరస్త్రాణము, తలపాగ

148. ద్రిండు = దట్టి, కాసె

151. కవదొనలు = రెండు తూణీరములు, గుణధ్వని = వింటినారి మ్రోత

152. బూరటిల్లుట = నిండుట, ఉబ్బుట

153. కేతనము = టెక్కెము, జెండా దేవత్తము = అర్జునుని శంఖము, తొడయు = తుడుచు

154. బిట్టు+ఉలియు = ఎక్కువగా మ్రోగు, శంఖము+ఒత్తినన్ = శంఖము ఊదగా, వేధ = బ్రహ్మ

155. త్రిదశులు = మూడు దశలు గలవారు (వార్ధకము మినహా) దేవతలు

162. రథనేమి–నిస్వన–జ్యా–నాద–మేదురము = రథముల చక్రములు, అల్లెత్రాటి మ్రోతలతో దట్టమైనది, గాంగేయుడు = గంగా పుత్రుడు, భీష్ముడు

163. ఒక్కమొయి = ఒక పద్ధతితో, పడగ పఱపు = పతాక వైశాల్యము, పఱివోవు = కొల్లపోవు, నశించు. పొచ్చెము = న్యూనత, కపటము. దండడివెట్టు = రాయిడిచేయు, అధికపఱచు, మొనలు + ఏర్చి = సైన్యములు పన్ని, రాలచ్చి = రాజ్యలక్ష్మి, తొడరుట = ఎదిరించుట, యత్నించుట

ఉ॥ వచ్చినవాఁడు.

తా॥ యుద్ధమునకు వచ్చిన వాడెవరో కాదు. అర్జునుడు–తప్పక మనము గెల్తుమని చెప్పుటకు వీలులేదు. రాజ్యలక్ష్మిని గైకొనుటకు చేయు యుద్ధములో ఇరు పార్శ్వములను గెలుచుట సంభవము కాదుగదా! యుద్ధము సంభవించిన అత్యధికమైన నష్టము వాటిల్లును. యుద్ధ

సన్నాహమునకు పూనుటయన్న అన్ని నష్టములను సహించుటయే కాగలదు. ఇదికాక వేరు ఉపాయము కూడ నున్నది. అదిసంధి. దానికై ప్రయత్నించుట శ్రేయస్కరము.

170. వీచోపులు = (వీచు+చోపులు) వింజామరలు.

172. లేటమొగమువడు = విముఖమగు, ఉత్తలపాటు = కలతపాటు.
తీఁగ తిగిచినగతిన్ = తీఁగె ఎత్తిపట్టినట్లు, గర్జన + ఉదగ్ర + తర్జనుండు = గర్జనలతో కూడిన భయంకరములైన అదలింపులు గలవాడు.

177. దాయ = శత్రువు, జ్ఞాతి.

179. పేరువాడి = పేరున పిలిచి, నీరంధ్రము = దట్టము. వెరచఱచి = భయపడి. ప్రతీ పటాకినీతురములను = ఎదుటి సేనతోడి దొమ్మియుద్ధము, సంరావము = ధ్వని, కెరలు వొడుచు = విజృంభించు, తెరలఁబాఱు = తొలఁగు

182. ఎలిఁగించు = కూయు, కేకవేయు, నూల్కొలుపు = పురికొల్పు

184. కార్కొను = నల్లఁబాఱు, దండడించు; మొగులు కొమరున = మేఘము విధమున; కవియు = పర్వు, క్రమ్ము, ఉద్ధురమారుత చండభంగిన్ = బలువైన పవనము వంటి ప్రచండ పద్ధతితో

185. గొడగొని = విజృంభించి

183. కేతు ప్రేంఖణము = ధ్వజము యొక్క నృత్యము కేతనోజ్జ్వల విభ్రమవాడు = టెక్కెముతో ఒప్పుచున్న విలాసముగలవాడు, కలశజుడు = కలశము నుంచి పుట్టినవాడు, ద్రోణుడు, వెక్కసపడి=అసహ్యపడి, వెక్కసము = అధికము నిరర్గళ—భుజ—అర్గళ—సంరంభ—విజృంభణము = అడ్డులేని భుజములను గడియలయొక్క ఆటోపము. అప్పళించు= ప్రయత్నించు, ఆస్ఫాళించు, కొట్టు

192. అస్త్రకము = ధనుర్మధ్యము, వింటినడిమిపిడి, మార్గణము = బాణము

194. సపాటంబున = వట్టముగా, అరాతిబలము = శత్రుబలము, రోదసీ—కుహార—కర్పరము = భూమ్యాకాశముల గహ్వారమను కపాలము. ఉచ్చిపోవుట = నాటుకొనిపోవుట, దుసికిల్లుట

కం॥ తన దృష్టియు ...

తా॥ అర్జునుడు తనదృష్టిని, ముష్టిని ఒక్కటిచేసి విల్లెత్తి బాణములు వేయుచున్నాడు. అట్లు బాణము సారించి విలుదించినదే తడవుగా ఒకేసారి పది పదివేలను బాణములు వింటినుండి వెలువడి శత్రువుల గాయముల వెంబడిదూసుకొని పోవుచున్నవి.

కోల = బాణము

197. పోఁజిన మాడ్కి = సన్నగా చీల్చిన విధముగ. సాఁబాలుగా = సగభాగముగా, అడరి =అతిశయించి. ప్రతి హతంబుల గావించుట = తిరిగి కొట్టుట

అక్షత - ధ్వజ - సూత - హయత్వ = మొక్కపోని ధ్వజము, సారథి, గుఱ్ఱములచేత, లసత్ - అఫల్గు - రథ - వల్గనుండు = ఒప్పుచున్న దృఢమైన రథము దాని వేగము గలిగిన ఫల్గునుండు, అర్జునుడు.

198. అఱువ్రల్లు చేసి = శిథిలపఱచి, మార్తురు = శత్రువులు

200. శా॥ శక్తిస్ఫార:-

తా॥ బలోద్ధతములైన అర్జునుని దీర్ఘ బాహువుల సంరంభముతో గాండివ మొప్పుచున్నది. గాండీవమునుండి వెలువడిన బాణములచే కొట్టబడిన శత్రువులు రక్తసిక్తగాత్రులై బాగుగా వికసించిన పువ్వులుగల రక్తాశోక వృక్షముల వలెనున్నారు.

202. నలిరేఁగి = అతిశయముగా

మ॥ ఒకమాత్రేన్

204. తా॥ అర్జునుడు విరివి, దట్టము, తీవ్రత్వమును గల బాణములను ఒక్కుమ్మడి సమస్తసైన్యముల మీదను వెదజల్లినాడు. అట్లు వెదజల్లిన అర్జునుని వర్చస్సు, తన కిరణదీప్తులను ఒకేసారి లోకమంతటను విరజిమ్మ అవి భూనభములనిండనూ పర్వికొనగా దేదీప్యమాన ప్రభలతో వెలుగొందు సూర్యునివలె వెలుగొందు చున్నది.

ఇచ్చటి ధారాగ పద్యాకృత వ్యాప్తిలోని ఔచిత్యము గ్రహ్యనార్హము.

207. [illegible] లేల...

తా॥ అర్జునుడు రెండమ్ముల పొదులను ఏల ధరించునను సంశయము కలుగనక్కరలేదు. ఎందువలననగా నాతడు భీకరమైన సంగ్రామ సంరంభమున కుడి యెడమ చేతులలోనికి గాండీవమును మార్చి మార్చి ఎప్పుడును బాణమునకును దృష్టికిని పొం దెడబాయ కుండునటుల సంతత శరధారాపతనము గావించు చున్నాడు. కావున అతనికి రెండుతూణీరములు అవ సరమయియేయుండును.

పొరి = క్రమముగా, దృఢముగా.

208. అవితథమై = వ్యర్థముకానిదై.

210. శుంభత్ + వేగుడై = ఒప్పుచున్న వేగముగలవాడై.

212. ఉల్కికి = కొఱవి.

213. త్రెస్సి = తెగి.

219. ప్రతి హేతి ఖండనాదక్షత = శత్రువుల, ఆయుధము లను ఖండించుటలోగల నేర్పు, సహస్రాక్ష తనూజుడు= వేయికన్నులవాడైన ఇంద్రునియొక్క పుత్రుడు, అర్జునుడు. పర + అస్త్ర + క్షతి = ఎదుటి బాణ ములయొక్క ప్రహారము.

ఉ॥ శిక్షిత చిత్ర...

తా॥ అర్జునుని సారథి, రథము, గుఱ్ఱములు, ధ్వజాదులు పరుల ప్రహారములకు గుఱిగాక నిరపాయముగా నున్నవి. దీనికి కారణమేమన శిక్షిత సమరకళా విన్యా సములందు అర్జునుడు ఎదుటిబాణములను ప్రతి హాత మొనర్చుటలో మిక్కిలి నైపుణ్యమును చూపించు

చున్నాడు. అదియునుగాక అతనికి దైవము అనుకూలించియున్నది. ఇది కౌరవపక్షమునకు భరింపరాని విషయము. అత్యంత బాధాజనకమున్నా.

221. బారిసమరెడు = (బారి + చమరెడు) హింసించెడు.

224. ఉడుకువ = విశ్రాంతి, ఊటట; చక్కచేయుట = ఖండించుట, చండికనము = మూర్ఖత్వము.

225. కెడ నిగుడ = పార్శ్వమున ప్రకాశించగా.

226. ఇట్టలము = అధికము.

227. విన్నిగ్గళ-కరి ఆకృతి = అడ్డులేని ఏనుగుయొక్క ఆకారము.

229. గోత్ర + భిత్ - సూనుడు = పర్వతములను ఛేదించిన ఇంద్రునికుమారుడు (అర్జునుడు).

230. అభ్రగజము = మేఘమను ఏనుగులేక ఐరావతము. వర్షిన్యుడు = వర్షాధిదేవత, ఇంద్రుడు.

231. వీఁక = ఉత్సాహము, వేఁకని = భారమైన.

232. అద్రువ = అదర, కంపింప.

234. కలను = యుద్ధము.

235. యూధము = ఏనుగుల సమూహము.

242. ఒడ్డు + ఓలగము = పెద్దకొలువు, చూఱ = కొల్ల, దోపిడి.

245. అఱుముట = ఆక్రమించుట, ప్రతీక్షించుట. ప్రతిన = ప్రతిజ్ఞ (కువికృతి).

246. సొక్కు + ఎక్కు = మూర్ఛిల్లి.

249. ఆటకటము = ఇఱుకుచోటు, చెప్పెడుకొలఁదియె = చెప్పినకొలఁదియు.

256. మార్గణము = బాణము

259. ఊర్జితము = దృఢము, అడియాలము = చిహ్నము, గుఱుతు; మిట్టకోల = తీక్ష్ణమైన బాణము.

260. బృందారకులు = దేవతలు, వాణినీపరివృతుడు = సేనచే చుట్టుకొనబడినవాడు.

272. అసమున = చనవున, దర్పమున.

278. అలుపు = అలుగు, పరీవాహము.

279. మెయివొదలన్ = శరీరము ఉప్పొంగగా, స్తోమము = సమూహము.

282. నెత్తము = జూదము, సుమాళము = ఆనందాతిరేకము, సారెలు = పాచికలు.

283. పణము = పందెము, కాతీయఁబడడె = ఓటుతనపడడా!

287. అచ్చెరువు = ఆశ్చర్యము (నకు వికృతి).

289. కటము = చెక్కిలి, గండభాగము.

290. చ॥ కురుబలమేల...

తా॥ ఒక్క కురుబలమేమిటి ? సురాసురులను సైతము గెల్వవచ్చును. ఏలనన శత్రువులకు భయముగొల్పు బాహుబలమును చూపించుసమయ మేతెంచినదని విక్రమోజ్జ్వలుడై సమరక్రీడానిరతుడై బృహన్నల ఉత్తరునకు బాసటగా నిల్చియున్నాడు.

297. పడగ యెత్తు నురగఫాలరేఖ = పడగనెత్తిన పాము యొక్క ఫాలభాగము.

300. కీలాలము = నెత్తురు, ఒకహాని పుట్టుటకుఁజాలక = కీడు వాటిల్లుట సహింపలేక

303. ఆదటన్ = ప్రేమతో

చం॥ కురుబలమున్ ...

తా॥ కురుబలమును జయించుట. గోవులను మరలించి తెచ్చుట రెండునూ బృహన్నలయొక్క బాహుబలము వలననే సిద్ధించినవి. నేనేకాదు. అర్జునుని సహాయము వంటి సహాయసంపద లభించకయున్న ఎవరు ఎవరిని జయింప శక్యమైయుండెడి. నా బ్రతుకుతీరు ఎట్టిదో మీరు ఎఱిగియున్నదేకదా !

305. ప్రతిహారి = కావలివాడు, ద్వారపాలకుడు.

318. ఉ: బాసటలేదు...

విరాటుడు ఉత్తరునితో ననుచున్నాడు.

తా॥ యుద్ధరంగములో నీకెవరునూ సహాయము లేరు. మీరు మిక్కిలి అదమ్య బలముతో వీరోత్సాహమున శత్రువును ఏదుర్కొనినట్లయిన నీవుపోడిన దిక్కును వారును పోడి నీవుమరలిన దెసకేమరలి మీదిమీదికి క్రమ్ముకొని వచ్చెదరు. మనము పన్నిన వ్యూహము నిర్మూలింపబడిననూ మనను వారు విడువరు, కొనప్రాణముతో నొక్కడే యున్నాడని దూసికొనివచ్చి మీదబడుదురు.

320. ఎక్కటిదాఁకి = ఒంటరిగా ఎదుర్కొని.

326. ఉపాంతము = సమీపము, మూల; వెల్చె = తోచె.

328. భటోత్కరముల్ దిట్టినయట్లు గూలె = భటసమూహములు శాపవశమున కూలినట్లు కూలెను.

[illegible] [illegible]లోనన్ = నేటి రేపటి[illegible]

333. ధనంజయుడు = అర్జునుడు.

338. పొగడును = పొగడగా.

340. జముప్రోలు = యముని పట్టణము.

343. చ: అనవుడు...

తా॥ యుధిష్ఠిరుడు తన తమ్ములతో నిట్లనుచున్నాడు. విరాటుడు ఇప్పటివరకు మనలను ఎఱుగడు. అతని చాటుననుండి మన అవసరమును తీర్చుకొంటిమి. ఇప్పుడాయనకు కీడుచేయుట మంచిదిగాదు. ఇక మన నాటిడు తెలుసుకొనునట్లుచేయుదము. అప్పటికినీ అనగా మనలను తెలుసుకొనిన తరువాతగూడ యధాపూర్వ మెఱుగనట్లుగనేనడచినఅప్పుడే తగినశాస్తిచేయుదము.

344. కందు = తాపము.

347. ఎల్లిదము = చులకనతనము.

350. నడదివియలు = దివిటీలు, కాగడాలు (నడచుచున్న దీపములు) నూరయాణము = దండయాత్ర.

353. అవిషహ్య పరాక్రమ దుర్గముడు = సహించరాని పరాక్రమముచే దుర్గమనీయుడు.

363. అనవద్య సిక్షావిధిన్ = అనింద్యమైన శిక్షణతో.

372. తగవు + ఒందగ = అర్హమగునట్లుగా.

376. ఏనన:—...

తా॥ విరాటుడు అర్జునునితో నిట్లనుచున్నాడు. ఓ ఇంద్రతనయుడా! మీరు నన్ను ఒక్కనిని వేఱుచేసి మాట్లాడుచున్నారు. ఇది భావ్యమా ? ఇన్ని వత్సరములు మీరు అరణ్యావాసములో నెన్నియో కష్టము

లనుభవించి తుదకెట్లనో కార్యము నెరవేర్చుకొని ఇప్పుడే కొంచెము సుఖముననున్నారలు. ఇదంతయు పుణ్యదేవత నాయందనుగ్రహము చూపుట వలననే జరిగినది. ఇంతకు నేను అదృష్టవంతుడను.

375. చం. అనవిని...

తా॥ అనగా విని యుత్తరుడు విరాటుని కిట్లనుచున్నాడు. ఈ రాజ్యము వీరిదిగాక మనది ఎట్లగును. నిన్నా, నన్ను నూ, నిన్నా, ఈనాడుకూడ దుర్ధరులైన శత్రువులను హతమార్చి మనలను రక్షించినది కాక వీరిని గురించి అధికముగా జెప్ప నింకేమున్నది!

378. కరిపురికెత్తునట్టిపని = హస్తినాపురమువాసి కెక్కునట్టిపని.

381 నీఱు = బూడిద.

చ. సవినయవృత్తి...

తా॥ సవినయముగా మనము వీరిని సేవించలేదు. గడచిన ఇన్నిరోజులనుండి వీరు నివురుగప్పిన నిప్పులవలె తమ తేజమును బయల్పడనీయక మనలనుసేవించియున్నారు. పెద్దలతో సేవచేయించుకొనినందువలన మనము అపరాధులము. ఈ అపరాధదోషము మనలనంటియున్నంతవఱకు మన హృదయములు కుదుటబడియుండవు. మనము వారివద్దకు వెళ్ళి ప్రార్థించిననేగాని మనకాత్మ శాంతి గలుగదు.

385. పులు కడిగిన మదనాస్త్రము రేఖ = మాలిన్యము పోవునట్లు కడిగిన.

386. వక్షస్థలలక్ష్మి = వక్షలక్ష్మి.

## జాతీయములు

ముడిపడుచుండుట
ఆలిగొనుట
కూయివచ్చుట
కుఱుచ సేయుట
చిత్తంబునడయుట
చిత్తముపసిఁగ్రమ్మరించుట
చిడిముడిపడుట
నేలగోడివడుట
ముద్దుచేయుట
చిత్తవృత్తిచిక్కబట్టుట
క్రొవ్వెఱుగకుండుట
వేడ్కలుగొనలునిగుడుట
గుండియ లవియుట
గొందగొనిపోవుట
వెక్కసపడిచూచుట
మేనుపొంగుట
కుప్పంగూరలుగాఁదొరఁగుట
పీనుగపెంటలగుట
లావుచేయుట
కటకటఁబడుట
మెయివొదులుట
కాఱియఁబడుట
ప్రాణములు దీపగుట
ఎలుగువడకుట

## అలంకృతపదములు

1. నడిపన్న యేడ్తెఱ
2. పెంపు, లావు వెరవు
3. తలకు మనము
4. గగుపాటిన మేను
5. ఱిచ్చవడిన చూపు
6. పెలుకుఱు దీన దృష్టులు
7. చిచ్చుటి పిడుగు
8. విఱిగిన బంటులు
9. కైదువుమోవఁగుబమ్మి
10. తనివోని చూడ్కులు
11. ఎక్కుడుమాటలు
12. పెద్దయుఁబ్రొద్దు
13. కీడు తెరువువాడు
14. నేల నాలుగు చెఱఁగులు
15. ఉబ్బుమైమాట

## సామెతలు - సాదృశ్యములు

16. పనివడి ఱోలగొట్టిన లీల
17. విధి గెలువవసమె బ్రహ్మకు నైనన్
18. నివురుగవిసిన మెఱయని నిప్పువోలె
19. త్రొక్కబడ్డ యహిగతి
20. మంటలో మిడుతలు సొచ్చినట్లయిన
21. భటోత్కరముల్ దిట్టినయట్లుగూలె
22. కరి వ్రాతముల్ ధర దంతంబుల యూఁతగా నొఱగె
23. నడ దివియలుసేసె నగరికి మాణిక్యమకుటముల్
24. పదనికిరాఁబులు గడిగిన మదనాస్త్రము రేఖ గలిగి
25. పసులదయ్యె మెఱుగు పడతుల సంతోషమేలనాకు
26. రెండలువులందు వెడలు సంతోష పూరంబు విధముదోప
27. భాగ్యమయ దేవత సన్నిధి సేతగాదె

## కొన్ని విశిష్టప్రయోగములు

# తప్పులు - ఒప్పులు

## పద్యభాగము

| పేజీ | తప్పులు | ఒప్పులు |
|---|---|---|
| 10 | లగునట్లి | లగుపట్లి |
| 21 | సద్వివిధా | మద్వివిధా |
| 21 | పీనుడు | పీనుగు |
| 38 | వెలువెల్ల | వెలవెల్ల |
| 39 | హాయయత్వ | హాయప్వ |
| 40 | నుత్కూటంబు | నుత్కూటంబు |
| 46 | నెష్ఠైని | నెష్ఠిని |
| 54 | నెఱింగింప | నెఱిగింప |
| 69 | జోగడుడు | బోగడుడు |

## టీకా తాత్పర్యములు

| | | | |
|---|---|---|---|
| 2 | ఆపహాస | = | అపహాస |
| 6 | సర్వము | = | స్వరము |
| 9 | బలేద్ధత్యము | = | బలాద్ధత్యము |
| 10 | హాయాన | = | హాయన |
| 12 | ప్రతీపటాకినీ | = | ప్రతిపతాకినీ |
| 17 | వాణినీ | = | వాహినీ |
| 19 | పిక్షా | = | శిక్షా |

గమనిక :— పీఠికలోని 'ఉత్తరా వివాహిత' కు 'ఉత్తర వివాహిత' గను, 'అవీరవరము' కు 'అవీరవీరము' గను, 'రామణీయకత', 'నిమ్నోన్నతములు' విశిష్ట ప్రయోగములుగను గ్రహించునది.

# మా ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | రాజేంద్రప్రసాద్ ఆత్మకథ | 2 | 50 |
| 2. | కథావీథి | 2 | 00 |
| 3. | శ్రీకృష్ణరాయబారము | 1 | 50 |
| 4. | హిమబిందు (నవల)<br>శ్రీ అడివి బాపిరాజు | 2 | 50 |
| 5. | కావ్యతోరణము | 1 | 50 |
| 6. | ప్రహ్లాద చరిత్రము<br>సంకలనం: శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు | 1 | 50 |
| 7. | ప్రతిజ్ఞాయౌగంధరాయణం,<br>స్వప్నవాసవదత్తము (నాటకములు)<br>అనువాదం: శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు | 1 | 50 |
| 8. | గాంధీజీ విద్యార్థి జీవితము | 0 | 50 |

ప్రతులకు :—

**దక్షిణ భారత హిందీ ప్రచార సభ**

**ఆంధ్ర - హైదరాబాదు**

ఆంధ్ర హిందీ ప్రచార ప్రెస్, విజయవాడ - 2.